☞ ఈ గ్రంథముద్రణాధికారమును శ్రీగంటి సూర్యనారాయణశాస్త్రిగారు మాకు విక్రయించిరి.

చెన్నపురి 1953. } వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

Printed by

V. RAMASWAMY SASTRULU & SONS

AT THE 'VAVILLA' PRESS

MADRAS—1960.

“ప్రబోధయచంద్రోదయము” అనునాటకములంబలె యితివృత్తముల ననువదించిన మంచన, పిల్లలమఱ్ఱి పినవీరన, నంది మల్లయ, ఘంట సింగయకవులు తాము వరుసగ రచించిన కేయూరబాహుచరిత్రము, శృంగారశాకుంతలము ప్రబోధచంద్రోదయము అనుకృతులను శ్రవ్యప్రబంధములుగనే కూర్చిరిగాని కేవల రూపకములుగ ఘటింపరైరి. సంస్కృతనాటకములుగాని, యాంగ్ల నాటకములుగాని మూలానుగుణముగ నాంధ్రభాషలో ననువదించుటయును స్వతంత్ర రూపకముల రచించుటయుఁ బందొమ్మిదవశతాబ్ది పూర్వార్ధమునకు ముందు జరుగలేదనియే చెప్పవలెను. కాని సంస్కృతదశరూపకములలో “వీథి” యను రూపకలక్షణములకుఁ జాలవఱకు సరిపడు “క్రీడాభిరామము” అను కృతి పదునేనవశతాబ్దిలో రచియింపఁబడినది యొకటిమాత్రము మనకులభ్యమగు నది. ఇది సంస్కృతమున “ప్రేమాభిరామము” అను పేర రావిపాటి త్రిపురాంతక కవి రచించిన రూపకము ననుసరించి వ్రాయఁబడినది. మూలగ్రంథమగు ప్రేమాభిరామ మింతదనుక దొరకనందునఁ గ్రీడాభిరామము దాని కెంత వఱకుఁ జేరిక యగు ననువాదమో నిర్ణయింప రాకున్నది. కాని పైని జెప్పినట్టు లిది వీథిలక్షణములకుఁ జాలవఱకు సరిపడుచున్న కారణమున మూలగ్రంథము గూడ దీనివలెనే వీథిరూపకముగ రావిపాటి త్రిపురాంతకుఁడు రచించి యుండు ననియు “క్రీడాభిరామము” అను నామాంతరముతో దాని కిది సన్నిహితానువాదముగనే చాలవఱకు రచియింపఁబడియుండు ననియుఁ దలంపవచ్చును. దీనికిఁ దాళపత్రప్రతి యొక్కటిమాత్రమే తంజావూరు సరస్వతీ మహాలు గ్రంథాలయమం దున్నది. అదియు శిథిలాతిశిథిలమును పెక్కు గ్రంథపాతములతో నున్నది. అందునను నవతారికాభాగము మఱింత శిథిలమయి యసమగ్రముగ నున్నది. ఈయున్న యేకైకప్రతినిబట్టియే దీనిని మొట్టమొదట 1909-వ సంవత్సరములో సుప్రసిద్ధ పరిశోధకులు, విద్వచ్ఛేఖరులు, సుగృహీతనాములు బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవి, ఎం. ఏ., గారు తమ “విస్మృతకవి” గ్రంథమాలికలోఁ బ్రకటించి యందఱ కందుబా

తగునట్లుగా రూ. 0-5-0లు స్వల్పమూల్య మేర్పఱచి యాంధ్రలోకమునకు మహోపకార మొనర్చినారు. ఈగ్రంథప్రకటనమునకు ముం దాంధ్రదేశమున జిరకాలమునుండి "శ్రీనాథుని వీథినాటకము" అనుపేర నొకచిన్ని పొత్తము ముద్రితమయి ప్రచారమం దుండెను. అచ్చటచ్చటి చాటుపద్యములను, శ్రీనాథుని వీథినాటకములోని వని అప్పకవీయము మున్నగులక్షణగ్రంథములలో నుదాహృతములయిన యొండు రెండుపద్యములను జేర్చి కూర్చిన తలయుఁ దోఁకయు లేని గ్రథనమే గాని యది యొకగ్రంథ మని చెప్పుటకే వీలులేనిది. దానియం దెట్టి యితివృత్తమును లేదు. దశరూపకము నందలి వీథినాటకలక్షణము లందు నందున కైన లే వని వేఱ చెప్పనక్కఱ లేదు. ఉపలబ్ధమైన శ్రీడాభిరామము వల్లభరాయకృత మని యాగ్రంథమును బట్టి తెలియనగును. కాని యప్పకవి మున్నగువారు లక్షణగ్రంథములలో "శ్రీనాథుని వీథినాటకము"లోనివిగా నుదాహరించిన "కందుకకేళి సల్పెడు ప్రాంగణమునన్..." "కుసుమం బద్దిన చిరకొంగు వెలయన్..." అను పద్యము లిం దాయా సందర్భములలో యథోచితస్థానములం దున్నవి. ఇందు చేరిన గ్రంథమందలి పలు పద్యములు శైలియందును శయ్యాసౌభాగ్యమునందును శ్రీనాథునిసార్వభౌమునికృతులందలి పద్యములను బోలియున్న కతమునను సిక్కుమయిన శ్రీనాథునివీథినాటక మిదియే యనియు దాని నాతఁడే రచించి గ్రంథకర్తృత్వమును వల్లభరాయని కారోపించియుండు ననియును మనవారు పలువురు తలంచిరి. అప్పకవి మున్నగు పూర్వలక్షణగ్రంథకర్తలు కొందఱిందలిపద్యములను శ్రీనాథకృతములుగాఁ జేర్కొన్నను మఱికొందఱు లక్షణగ్రంథకర్తలు, సంకలనగ్రంథకర్తలు నిందలిపద్యములను వల్లభరాయని వీథినాటకములోని వనియే యుదాహరించినారు. శ్రీరామకృష్ణకవి శ్రీడాభిరామమును మొట్టమొదట ముద్రించి ప్రకటించినప్పుడు తాము రచించిన యాగ్రంథపీఠికలో గ్రంథకర్తృత్వవిషయమున వల్లభరాయ శ్రీనాథుల యుభయపక్షమునకు నుపకరింపఁగల యాధారములను సంగ్ర

హేముగ వివరించి యుభయపక్షవాదములకుఁ గూడఁ బునాదుల నేర్పఱచి తాముమట్టుకు శ్రీనాథునివైపునకే మొగ్గుచూపిరి. తరువాతివిమర్శకు లాపునాదులపయి వాదసౌధముల నిర్మించినారు. శ్రీవీరేశలింగముపంతులుగారు తమ ఆంధ్రకవులచరిత్ర ప్రథమభాగపునర్ముద్రణములో దీనిని వల్లభరాయకృతముగనే పరిగణించి, శ్రీనాథరచిత మను వాదము నతి సాహస మని నిరసించిరి. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు "ఆంధ్రులచరిత్ర" మూఁడవభాగములో వల్లభరాయనివర్ణనము గ్రంథావతారికలో నతిశయముగా నుండుటవలనను, గ్రంథాంతపద్యము వల్లభరాయాశీఃపరముగా నున్నకతమునను నిది వల్లభరాయకృతము కానేర దని తలంచి శ్రీనాథుఁడే దీనిని వల్లభరాయని పేర రచించియుండు ననెడి యభిప్రాయమును బ్రకటించిరి. కాని యథార్థము మాత్ర మీయుభయవాదములకు మధ్యస్థముగ మఱుగువడి యుండెనేమో యని తలంచి, వీరేశలింగముగారు కవులచరిత్ర పునర్ముద్రణములో శ్రీనాథుని గుఱించి వ్రాసినకొన్నివిషయములఁ బురస్కరించి "శ్రీనాథమహాకవి గుణతత్త్వవిచారము" అను నావ్రాసినవిమర్శగ్రంథములో, పయిని బేర్కొన్న ముగ్గురుపండితుల యభిప్రాయములందలి బలాబలములను జర్చించుచు "క్రీడాభిరామము-శ్రీనాథునకు దానితోఁగల సంబంధము" అను ఖండ మొకటి వ్రాసి దుందుభి (1922) సంవత్సరములో దానిని బ్రత్యేకముగ ఆంధ్రపత్రికా సారస్వతానుబంధములోఁ బ్రకటించియుంటిని. శ్రీనాథున కీగ్రంథముతో సంబంధ మసలు లేకపోలేదనియు, అట్లు లేదన్నచో వల్లభరాయనికి గ్రంథకర్తృగౌరవముమాట యెట్లున్నను గ్రంథచౌర్యదోష మనివార్యముగ నంటఁగట్టఁదగు ననియు, శ్రీనాథుఁడు గ్రంథమంతయుఁ బూర్తిగఁ గానే వ్రాసి ధనలోభముననో, మఱియొకకారణముననో దానిని వల్లభరాయని పేరఁ బ్రకటించె ననుటకుఁ దగినకారణములు గానరా వనియుఁ గావున వల్లభరాయఁడు శ్రీనాథునిసాహాయ్యముతో నీగ్రంథమును రచించి యుండు ననుట సత్యసమ్మతమై యాయిరువురగౌరవమునకుఁగూడ నిర్బాధకమై యుండఁగల దనియు ఆవ్యాసమందలి సారాంశము.

శ్రీనాథుని సిద్ధహస్తమిందుఁ బలుతావుల సువ్యక్తమగుచుండ నాతని కీగ్రంథరచనమున నెట్టిసంబంధమును లేదని తత్కవితారసజ్ఞు లెన్నఁటికి నంగీకరింపఁజాలరని నాయాశయము. శ్రీనాథుని యితరకృతులందును దీనియందును దగ్గఱిపోలికలు గలసంవాదములను, రచనాసంవిధానములను, భేదమొకింతయు లేక సరిసమానములుగ నట్లే యుంచిన పాఠములను సమాసములను శ్రీనాథుని కవితయందుఁ బ్రత్యేకముగఁ గానవచ్చు నాతని మురిపెంపుఁ బదప్రయోగములను నాయభిప్రాయానుకూలముగఁ గొంతవఱకు నాపూర్వోక్తవ్యాసమున నుదాహరించియుంటిని. అటుతరువాత 1923-వ సంవత్సరములో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి "శృంగారశ్రీనాథము" అను శ్రీనాథకవిచరిత్రగ్రంథము వెలువడినది. దానిలో శాస్త్రిగారు క్రీడాభిరామకర్తృత్వమునుగూర్చి చర్చించుచు గ్రంథము శ్రీనాథకృతమే యనుట కాతని యితరకృతులందును దీనియందును సామ్యముగల సంవాదాదికములను విపులముగాఁ బ్రకటించి వల్లభరాయపక్షవాదమును బూర్తిగా నిరసించియున్నారు. కాని శ్రీరామకృష్ణకవిగారు తమపీఠికలో వల్లభరాయకర్తృత్వవాదపక్షసాధకములుగ లిఖించిన "చిత్రకవి పెద్దన, ముద్దరాజు రామన, శ్రీధరుఁడు, గణపవరపు వేంకటకవి, (పెదపాటి) జగన్నాథుఁడు, వీరందఱు వల్లభరాయని వీథినాటకములోని వని యుదాహరించినారు. జగన్నాథకవి రత్నాకరము (సంకలనగ్రంథము)లో 10 పద్యములకంటె నెక్కువగా వల్లభరాయని వనియే పేర్కొనెను. అళియరామరాయల మత్తాత యగు సోమభూపాలున కంకితమీయఁబడిన శ్రీధరచ్ఛందములో వల్లభరాయని వీథినాటకములోని దని "మంచన వింటివో వినవో..." అనుపద్య ముదాహరింపఁబడియున్నది."

అనువాక్యములఁగూర్చి చర్చించుటగాని, ఆంధ్రపత్రికాసాంవత్సరానుబంధ ప్రకటితమయిన నాపూర్వోక్తవ్యాసమందలి యభిప్రాయమును బరామర్శించుటగాని శ్రీ ప్రభాకరశాస్త్రిగారు తమగ్రంథమం దేమియుఁ గావింపరైరి.

అందుచే "సారస్వతసర్వస్వము" అనుమాసపత్రికలో 1924-25-వ సంవత్సరములలోఁ బ్రకటితమయిన నా "శృంగారశ్రీనాథవిమర్శనము"లో, శ్రీడాభిరామకర్తృత్వవిషయమునుగూడఁ జేర్కొని పైనిజెప్పిన నాయభిప్రాయమునుగూర్చి శ్రీశాస్త్రిగారిసమాధానములను గోరియుంటిని. పిమ్మట "భారతి"లో నీగ్రంథము కేవల వల్లభరాయకృతమేగాని శ్రీనాథకృతము కాదని వాదించు వ్యాసమును (సం. 4 సంచిక 4) శ్రీ వేమూరి విశ్వనాథ శర్మగారును, అందుపై ప్రభాకరశాస్త్రిగారి యభిప్రాయానుగుణముగ శ్రీనాథ కర్తృత్వమును సాధించువ్యాసమును (సం. 4 సం. 6) శ్రీకిళాంబి రాఘవాచార్యులుగారును, మరల విశ్వనాథశర్మగారి యభిప్రాయానుసారముగ వల్లభరాయకర్తృత్వమును సాధించు వ్యాసమును (సం. 7 సం. 2) శ్రీ కేసమల్ల అచ్యుతరావుగారును ప్రకటించియున్నారు. కాని వీరుగూడ నేదో యొక పక్షమును సమర్థించుటయేగాని శ్రీనాథవల్లభరాయల యిరువురగౌరవమునకుఁ గూడ నిర్బాధకమయి వారి యుభయకర్తృత్వము నంగీకరించు నా యభిప్రాయమునుగూర్చి చర్చించి యది సత్యనిర్ణయమున కెంతవఱ కుపకరించునో నిరూపింపరయిరి.

ప్రభాకరశాస్త్రిగారు నా శృంగారశ్రీనాథవిమర్శనమునందలి విషయములకు సమాధానము లెందును బ్రకటించియుండలేదు. వీరేశలింగముగారి వలెనే శ్రీనాథునిగుణశీలవిషయమున శ్రీప్రభాకరశాస్త్రిగారు తమ శృంగారశ్రీనాథములో నాతఁడు శృంగారిశేఖరుఁడు (స్త్రీలోలుఁడు) అనుభావమును ప్రకటించియున్నారు. లోకమున వాడుకలోనున్న కొన్నికట్టుకతలను బూటకంపుఁబ్రాయములగు కొన్నిచాటుపద్యములను విడిచినచో నిలువనీడలేని యిట్టి కళంకమును శ్రీనాథునిశీలవిషయమున పండితులయినవారు గూడ శాశ్వతముగ నుండఁదగుచరిత్రగ్రంథములలో వెల్లడించి యాతనికీర్తిని గళంకిత మొనర్చుట భావ్యము గాదు. కేవల మాతనికావ్యములఁబట్టి యిట్టి యపవాద మాతనియెడ

నెలకొలుపుట కాధారములు లేవని నాతలంపు. అందుచేఁ బూర్వోక్తము లయిన "శ్రీనాథమహాకవి; గుణతత్త్వవిచారము." "శృంగారశ్రీనాథవిమర్శనము" అను కృతులలోఁ బరామర్శింపఁబడిన ముఖ్యాంశములలోఁ దక్కువి సార్వభౌమునిశీలవిషయ మొక్కటి; చారిత్రకవిషయనిరూపణమునఁ జాటు పద్యముల యప్రామాణ్యమును ప్రభాకరశాస్త్రిగా రొకవిధముగాఁ దాము గూడ శృంగారశ్రీనాథమున నంగీకరించియే యున్నారు. అట్లయ్యు శృంగార శ్రీనాథవిమర్శనములో శ్రీనాథునిశీలవిషయమున నేఁ గావించిన విమర్శనమునకుమాత్రము బదులువ్రాసి తన్మూలమున శ్రీనాథుఁడు స్త్రీలోలుఁ డను తమవాదమును సమర్థించుకొనుటకును మరలఁ జాటువులనే యాధారముగాఁ గొని, 1929-వ సంవత్సరమున శ్రీగంటి సూర్యనారాయణశాస్త్రిగారు శృంగార గ్రంథమాలికాకుసుమముగఁ బ్రకటించిన "క్రీడాభిరామము" పునర్ముద్రణమునకుఁ దాము విరచించిన విపులపీఠికలో "శ్రీనాథునిశీలము" అను శీర్షిక క్రింద

"క. బూతుం బద్దెము లొకపైఁ
జేతులు వడఁగాడ మనసు చీఁదఱపడఁగా
రోఁత జనింపఁగఁ గూర్చెద
నీతిపరుల్ లోఁజపుఁడు నిన్నెప్డుంగాన్."

అను సొంతపద్యముతో నుపక్రమించి తాము సేకరించిన యశ్లీలములగు చాటువులఁగూడఁ బెక్కింటి నుదాహరించి వానికర్తృత్వము శ్రీనాథున కారోపించిరి. ఇట్టివిషయములలోఁ జాటుపద్యముల ప్రామాణ్యము నస్మదాదులము పూర్తిగా నిరసించునప్పుడు వారి యప్రామాణ్యమును దాముగూడ నొకవిధముగ నంగీకరించినప్పుడు, శాస్త్రిగారు మరల వానినే పట్టి ప్రాకులాడి వాని యాధారముననే శ్రీనాథునిశీలమును నిరూపించుటయందలి సామంజస్యము నాకు బోధపడలేదు. ఇక నీపీఠికలోనే శాస్త్రిగారు క్రీడాభిరామకర్తృత్వ

విషయమున నే సూచించిన మాధ్యస్థవాదమునుగూర్చి ముచ్చటించుచు నవి మునసబుకరణములు తగవులాడుకొనునిద్దఱు రయితులవివాదమును దీర్చినట్లున్న దని యసంగతమగు కేలివాక్యముతో సమాధానసంతృప్తి నందిరి. ఈగ్రంథ కర్తృత్వవిషయమున శ్రీనాథవల్లభరాయల కెట్టివివాదమును లేదు. ఉన్న వివాదమంతయుఁ దరువాతివార మగు మనము తెచ్చిపెట్టుకొన్నదే. కావున శాస్త్రిగారిసమాధానమందలి యౌచిత్యమును సహృదయులే నిర్ణయింపఁ దగును. రామకృష్ణకవిగారిపీఠికావాక్యముల ననుసరించి నేను వల్లభరాయ కర్తృత్వ సూచకములుగఁ గయికొనిన పూర్వలాక్షణికోదాహరణముల గొడవ యెత్తికొని శాస్త్రిగారు నావ్రాఁతలు రామకృష్ణకవిగారివాక్యముల కనువాద ములను మాటగుర్తింపకయే యవిబూటకంపుబూకరికంపులబుంగలనియు, దుర్వి వేక ధురంధరము లనియు నిరంకుశముగ నిరసించుచు శ్రీధరచ్ఛందము తమకు దొరకలే దనియు, శ్రీధరుఁడు శ్రీనాథునకు సమీపకాలమువాఁ డనుట కాధారములు మృగ్యము లనియు, పెదపాటి జగన్నాథకవి (సంకలన గ్రంథము) ప్రబంధరత్నాకరముతప్ప క్రీడాభిరామపద్యములను వల్లభ రాయనివీథినాటకములోనివిగా నుదాహరించిన ప్రాచీనలక్షణగ్రంథములు తాము చూచినంతవఱకుఁ గానరాలే దనియు, అప్పకవీయము, కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహము, వీరరాజీయము, లక్షణదీపిక యను వానిలో శ్రీనాథునివీథినాటకములోనివనియే యిందలిపద్యము లుదాహరింపఁ బడిన వనియు వ్రాసియున్నారు. శాస్త్రిగారు పేర్కొన్న వీరరాజీయము, లక్షణదీపిక ముద్రితమయినట్లు కానరాదు. నేను జూచిన ముద్రితలక్షణగ్రంథ ములలో అప్పకవీయమునఁ బూర్వోక్తములగు "కందుకకేళి..." "కుసుమం బద్దిన..."అను రెండుపద్యములుమాత్రము శ్రీనాథుని వీథినాటకములోని వవి యుదాహృతములగునవి. దానినిజూచియే కాఁబోలు కూచిమంచి తిమ్మ కవి సర్వలక్షణసారసంగ్రహమున "కుసుమంబద్దిన..." యనుపద్యమును దాను గూడ నట్లే యుదాహరించినాఁడు. అందులో "ఒచ్చెం బింతయు లేనియంచ

నడతో నొయ్యారము గుల్కుచున్." అని మఱియొకపద్యముగూడ నట్లే యుదాహృతమయినది. కాని యది క్రీడాభిరామమునఁ గానరాదు. అది బహుశః చాటుపద్య మయియుండును. (ఇది యించుకమార్పుతో ప్రభాకరశాస్త్రిగారిపీఠికలో నుదాహృతములయిన శ్రీనాథునిచాటువులలో నున్నది.) అసలుగ్రంథములను జూడకయే పూర్వలక్షణగ్రంథములనుండియే చాలవఱకుదాహరణపద్యములను గయికొనుట పలువురు లక్షణగ్రంథకర్తలకుఁ బరిపాటి యని చెప్పనక్కఱలేదు. కావున అప్పకవీయమునుబట్టియే తరువాతిలక్షణగ్రంథకర్తలుగూడఁ గొందఱు పూర్వోక్తపద్యములను దాముగూడ శ్రీనాథుని వీథినాటకములోని వని యుదాహరించియుండవచ్చును. శ్రీధరచ్ఛంద మింతదనుక ముద్రితమయి ప్రచారమున లేకున్నను రామకృష్ణకవిగారు "మంచన వింటివో—" అని పద్యనిర్దేశముగూడఁ జేసి యది వల్లభరాయనివీథినాటకములోనిదిగా శ్రీధరచ్ఛందమున నుదాహృతమయిన దని వ్రాయుటచే వారి వాక్యమును ద్రోసివేయఁజాలముగదా! ఇంతకుఁ బ్రాచీనులయినను, అర్వాచీనులయినను లక్షణగ్రంథకర్తలేమి, జగన్నాథునివంటి సంకలనగ్రంథకర్తలేమి; క్రీడాభిరామపద్యములను గొందఱు వల్లభరాయని వీథినాటకములోనివని, మఱికొందఱు శ్రీనాథునివీథినాటకములోనివని యుదాహరించియుండుటమాత్రము నిర్వివాదముగదా! గ్రంథావతారికలో వల్లభరాయని కవితావైభవము మున్నగునవి యతిశయముగ వర్ణింపఁబడిన వని గ్రంథాంతపద్య మంతని కభ్యుదయపరంపరాభివర్ధనములు మోపూరి భైరవస్వామి కృపసేయుఁగాత మని యాశీఃపూర్వకముగ నున్న దని వల్లభరాయఁడే గ్రంథకర్త యన్న నివి తానే తమ్ముకొని తానే చిరాయు వనుకొన్నట్లు హాస్యాస్పదములుగాక మాన వని, కూడ శాస్త్రిగారి వాదము. శ్రీనాథుఁడే గ్రంథకర్తయైనను తనయూరిపేరు లేమియును నందుఁ జెప్పకొనక గ్రంథము కేవలము వల్లభరాయనిపేరనే ప్రకటించినచో నిట్టి యాక్షేపణము తప్పని సరియే యగును గదా! కాని యవతారికయందలి స్తుతులేమి గ్రంథాంత పద్యమేమి సూత్రధారముఖమున వెలు

పడిన దని గ్రహించినప్పుడీయాక్షేపణమున కవకాశములేదు. నటీసూత్రధారసంభాషణవ్యాజమున స్వాత్మస్తుతులు గావించుకొన్న నాటకకర్త లెందఱు లేరు? గ్రంథాంతపద్యములో వల్లభరాయఁడు "కవీంద్రప్రకాంక్షితత్రిపథమహీరుహంబు" అని యుండుటచే నాతఁడు కవియశోలోభమున శ్రీనాథునకు ధన మిచ్చి దీనిని దనపేరనే వెలయింపఁజేసికొనె నని మఱొకయభిప్రాయమును ప్రభాకరశాస్త్రిగారు ప్రకటించినారు. హరవిలాసకృతిపతియగు అవచి తిప్పయసెట్టిగూడ నొకపద్యములో "కవిసంఘమనోరథకల్పకద్రుమా!" అని సంబోధింపఁబడినాఁడు. ఇట్టి కవికల్పద్రుమములకు వారికీర్తిని స్థిరస్థాయిగ నొనర్చు కృతిపతిత్వము చాలదా! అది గౌరవదాయకము కాదా! ఇంతను వల్లభరాయఁడు కేవలము కవియశోలోభముననే యిట్టి యకార్యమునకుఁ గడంగినచో నందుకు దొంగిలఁబోవ ముంగలము దొరఁకినట్లు యీలఘుకృతియా దొరకినది? విధముచెడినను ఫలము లభింపవలదా? అట్టితలంపే వల్లభరాయని కున్నచో భీమఖండ, కాశీఖండములవంటి యేయుద్గ్రంథమునో రచింపించి తనపేర వెలయించుకొనునుగాని యిట్టి స్వల్పకృతితో సంతుష్టినందునా? మిత్రులయాదరానురోధాదికకారణములచేఁ గావ్యరచనమున వారి కితరులు తోడ్పడుట మనలోఁ గ్రొత్తకాదు. ఆంధ్రవాఙ్మయమునకు మూలాధారమైన నన్నయభట్టారకుని భారతాంధ్రీకరణముననే యిట్టిపని జరిగినది.

"పాయక పాకశాసనికి భారతఘోరరణంబునందు నా
రాయణు నట్లు వానసధరామరవంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధురంధరుఁడుం దన కిష్టుఁడున్ సహా
ధ్యాయుఁడు నైనవాఁ డభిమతంబుగఁ దోడయి నిర్వహింపఁగన్."

అని నన్నయ్యయే నారాయణభట్టొనర్చినతోడ్పాటును జెప్పుకొన్నాఁడు. అయినను గ్రంథము నన్నయ్యపేరనే వెలసినది. నారాయణభట్టు ప్రత్యేకముగ రచించిన యితరకృతులు మనకేవియును దొరకనందున శైలీసామ్యనిర్ణయము

లనుబట్టి నన్నయ భారతమం దాతఁడు రచించినపద్యము లేవియో నన్నయ రచించిన వేవో మనము పోల్చ లేకున్నాము. అట్లే క్రీడాభిరామము పక్క-వల్లభరాయని యితరకృతు లేమియు లభింపనందునను, శ్రీనాథుని యితరకృతు లనేకములు దొరకుటవలనను గ్రంథము వల్లభరాయని పేర నున్నను నాతఁడు రచించినపద్యము విమిశ్రముగ నేర్పఱుపఁజాలక పెక్కుపద్యములు శ్రీనాథునిరచనములతోఁ బోల్కి గలుగుటచే నిది కేవలము శ్రీనాథకర్తృకమే యను వాదమున కవకాశ మేర్పడినది. ఈలఘుకృతికి మనకు దొరకినతాళపత్రప్రతి యేకైకమాత్రము. అదియు శిథిలాతిశిథిలము. అవతారికాభాగము మఱింత శిథిలము. ఈ నష్టమయిన యవతారికలో శ్రీనాథునిసాహాయ్య ముదాహృతమై యుండు ననియు దానిని బట్టియే యిందలిపద్యములను పూర్వలాక్షణికులు కొందఱు వల్లభరాయకృతములుగాను మఱికొందఱు శ్రీనాథకృతములుగాను పేర్కొనియుందు రనియు నా విశ్వాసము. దీనియందలి ప్రతిపదము శ్రీనాథునే పట్టియిచ్చుచున్న దని ప్రభాకరశాస్త్రిగారి ప్రతిపాదనము; అవ్వఁగాక. "యద్భావం తద్భవతి".

కాని కేవల వల్లభరాయకర్తృత్వవాదు లగు శ్రీ టేకుమళ్ల అచ్యుతరావుగారుకూడఁ దుదకు,

"కావున నీగ్రంథము వల్లభరాయకృత మనియే యంగీకరించుట యెక్కువన్యాయ మని యూహించుచున్నాను. వల్లభరాయఁడీగ్రంథమును రచించి తన స్నేహితుఁడు, కవిసార్వభౌముఁడు నగు శ్రీనాథునిచేఁ గొంత సాయము బొందియుండవచ్చునుగాని శ్రీనాథుఁడే యీగ్రంథ మామూలాగ్రముగా రచించె నని చెప్పుటమాత్రము కేవల మతిశయోక్తి యనియు నన్యాయ మనియుఁ దలంప సాహసించుచున్నాను."

అని వ్రాసియు, శ్రీనాథకర్తృత్వవాదమును తమ ఆంధ్రులచరిత్రలో బలపఱచిన శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు తాము తరువాత రచించి ప్రకటించిన "శ్రీనాథకవి" యను ప్రత్యేకకృతిలో

“ఈవీథినాటకము పైహేతువులచేత వల్లభామాత్యవిరచితము కాదేమో యని యెట్టివానికిని సందియము గలుగక మానదు. ఎట్లయినను, అంతకుఁ గాక పోయినను గొంతవఱకయినను, శ్రీనాథుని చేయి యీరచనమునఁ బొలుగొని యుండదకదా? యని విశ్వసింపవలసివచ్చుచున్నది.”

అని నిశ్చయించియు నొకవిధముగ నాయభిప్రాయసరణినే యనుసరించియున్నారు. తెగ తెంపులేక యిట్లు తగవులకుఁ దావకమగుచుండిన యీకర్తృత్వవిషయము తెగఁదీసి బహిష్కార మగునను తలంపుతో, శృంగారగ్రంథమాలవారి క్రీడాభిరామ పునర్ముద్రణపీఠికలోని ప్రభాకరశాస్త్రిగారి ప్రతివిమర్శాంశములఁగూడఁ బరామర్శించుచు “క్రీడాభిరామకర్తృత్వము” అనువ్యాసము మఱియొకటి వ్రాసి 21-9-1930-తేదిని పెద్దాపురములో జరిగిన ఆంధ్రసాహిత్యపరిషద్వార్షికోత్సవసభలో పండితసమక్షమునఁ జదివి దానినే తరువాత “భారతి” (సం. 9 సం. 4) లోఁ బ్రకటించియుంటిని. దానిపయి శాస్త్రిగారుగాని యితరులుగాని మఱి ప్రతివిమర్శన మేదియుఁ బ్రకటించియుండలేదు. అభిరుచిగలపాఠకు లావ్యాసమును బూర్వోదాహృతములగు నితరవ్యాసములను జూడఁదగును.

శ్రీనాథునిశీలమునకే యిట్టి కృతిరచనము తగియున్న దని యమాత్యని శృంగారశేఖరత్వమును నిరూపించుట కిదిగూడ నొకసాధకమని శ్రీప్రభాకరశాస్త్రిగారి మఱియొకవాదము. “శృంగమియర్తీతి శృంగారః” అనునట్లు రసములన్నిటిలో శృంగము (ప్రాధాన్యము) వహించిన శృంగారరసము పలువురు కవివరులకావ్యములందువలె శ్రీనాథునికృతులందునుగూడ బలుతావుల వర్ణి విరిసినను మొత్తముమీఁద నాతనిగ్రంథములెల్లఁ బరమశివభక్తిప్రఘోషణము లనియే పేరుగొన్నవి. వానియన్నిటియందును వ్యభిచారిణులు, స్త్రీలోలత మున్నగుదురాచారములు భంజింపఁబడినవేగాని హర్షింపఁబడలేదు. “ఏయజ విక్రయం బడయఁ గానికులంబున నుద్భవించి యన్యాయము సేయుచే యుటు

దురాత్ముఁడు వీఁడు త్రపాభిమానముల్ । మాయఁగ పట్టియుంచు నతిమాత్రము లజ్జితుఁడైన కైవడిన్ । తోయజషండబాంధవుఁ డధోముఖుఁ డయ్యె నభోంగణమ్మునన్" అని వ్రాసి బ్రాహ్మణులంగజవికృతికి లోనుగా రాదనెడి యున్నతనీతి నుద్ఘాటించిన సుశీలుఁ డాతఁడు. క్రీడాభిరామమునఁ గూడ సాంఘికదురాచారములు, శ్రీకాకుళము తిరునాళ్లలో బ్రాహ్మణయువకులు వితంతువులు సల్పెడు దుర్వర్తనములు మున్నగునవి రసికజనహృదయంగమముగఁ గేలి సేయఁబడుట పాఠకులు గుర్తింపకపోరు. దీనికర్త శ్రీనాథుఁడయినను వల్లభరాయఁడైనను నాతఁడు దుశ్శీలుఁడనిమాత్ర మీకృతివలన నిరూపితమగు నని విజ్ఞు లెవరు తలంపఁజాల రని నా విశ్వాసము. మూలగ్రంథ మగు ప్రేమాభిరామమును రచించిన రావిపాటి త్రిపురాంతకుఁడు—త్రిపురాంతకోదాహరణకర్త—మహాశివభక్తుఁడుగా గణింపఁబడినవాఁడు. శ్రీనాథునిశీలవిషయమున ప్రభాకరశాస్త్రిగారు శృంగారశ్రీనాథమునను మరలఁ గ్రీడాభిరామబృహత్పీఠికయందును వ్రాసినవ్రాఁతలకు సముచితసమాధానములను నా "శృంగారశ్రీనాథవిమర్శనము" నను, ఆంధ్రేతిహాసపరిశోధకమండలివారి "రెడ్డిసంచిక"లోఁ బ్రకటితమయిన నా "శ్రీనాథమహాకవి" అనువ్యాసమునను నొసంగియే యున్నాను. వలయువారు వానిని దిలకింపనగును. ఇఁక నితరాంశములఁ గూర్చి సంగ్రహముగ వివరించెద.

## కృతికర్తవంశము - ప్రశంస

దీనికర్త వినుకొండ వల్లభరాయఁడు, విశ్వామిత్రగోత్రజుఁడగు నియోగి బ్రాహ్మణుఁడు. ఇతని తాతతండ్రులు విజయనగరరాజులదండనాథులు భాండాగారాధ్యక్షులు నయి వినుకొండదుర్గము మున్నగువానిని పరిపాలించెడివారు. ఆగ్రామనామమునుబట్టియే వీరిగృహనామ మేర్పడియుండును. గ్రంథావతారికయందలి పద్యములను సక్రమముగ సావధానముగఁ జదివి సమన్వయము చేసికొన్నచో వల్లభరాయనివంశవృక్ష మీక్రిందివిధమున లిఖింపఁబడును.



విశ్వామిత్రుఁడు (గోత్రకర్త)
మంచన్న
చంద్రామాత్యుఁడు (పెదబుక్కరాయలమంత్రి)
(భార్య పోచమ్మ)
మంచన (భార్య తిప్పమ)
సింగన
తిప్పన
మల్లన (భార్య మిరుతూరి ఐరమంత్రి కూఁతురు త్రిపురమ)
చెన్నమంత్రి
చంద్రమంత్రి
వల్లభన్న
లింగన (రెండవ హరిహరరాయల సేనాని)
తిప్పన (భార్య హరితగోత్రుఁడగు తిప్పన తనయ పెద్దమాంబ)
సింగన
భైరవుఁడు
వినుకొండ దుర్గాధ్యక్షుఁడు-రెండవ హరిహరరాయలభాండారి
భైచన మల్లన పోచన తిప్పన
భైచన మల్లన తిప్పన (భార్య చంపమాంబిక)
మోపూరు పరిపాలకుఁడు, రాయనవరత్నభండార రక్షకుఁడు
వల్లభామాత్యుఁడు
(కృ

అవతారికయందలి "గంధవతీప్రతీర..." అనుపద్యమును దాని వెనువెంటనేయున్న "అందు" అనువచనమును, ఆతరువాతనున్న "మూఁడుగ్రామగ్రాసములతోడ..." అనుపద్యమును సావధానముగఁ బరీక్షింపక శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు తమపీఠికలో నీకడపటిసీసపద్యము మొదటినాల్గుపాదములలోను బ్రశంసింపఁబడిన విశేషములన్నియుఁ గృతికర్తయగు వల్లభరాయపరముగా గ్రహించిరి. అది సరిగా దనియు, "గంధవతీప్రతీర..." అనుపద్యమున వర్ణితుఁడయిన తిప్పన మూవురుపుత్త్రులలోఁ గడపటివాఁడు, సీసపద్యము యొక్క యెత్తుగీతిలో "ఎవ్వఁడు" అను యచ్ఛబ్దముచే నిర్దేశింపఁబడినవాఁడు నగు త్రిపురాంతకాధీశ్వరునకే (తిప్పన) యివి వర్తించు ననియు నాతని పుత్త్రుఁడే కృతికర్తవల్లభరాయఁడనియు,ఆంధ్రపత్త్రికాసారస్వతానుబంధములో 1922-వ సంవత్సరమునఁ బ్రకటితమయిన నావ్యాసములో వివరించియుంటిని. కాని యిది గమనింపక యితరులు ప్రభాకరశాస్త్రిగారుగూడ రామకృష్ణకవిగారివ్రాఁతనే యనుసరింపుచువచ్చిరి. ఇందుచేతనే శృంగారగ్రంథమాలికవారి పునర్ముద్రణప్రతిలో ప్రభాకరశాస్త్రిగారు "గంధవతీప్రతీర..." అనుపద్యము నాల్గవపాదమున తిప్పన పుత్త్రులనుగూర్చి చెప్పిన "బైచనమల్లన తిప్పమంత్రులన్" అను సమాసమందు "మల్లన" అనుపదము "వల్లభ" అని యుండవలె నని సూచించి యందు కనుగుణముగనే తమపీఠికయందలి వంశవృక్షమును లిఖించిరి. ఇది సరి గాదని కృతికర్తయగు వల్లభరాయని తాతతండ్రు లిరువురుగూడ తిప్పనామాంకితులే యని తాత తిప్పన పెద్దమాంబభర్త యనియు, తండ్రి తిప్పన చందమాంబభర్త యనియు మనము గ్రహింపఁదగును. తాతతండ్రుల యనంతరము వారిపదవులు వల్లభరాయనికి సంక్రమించియుండును. మోపూరు కడపజిల్లా, పులివెండ్లతాలూకాలో నున్నది. అచ్చటి కొండగుహలో భైరవస్వామియాలయ మిప్పుడుగూడ నున్నదని తెలియుచున్నది. ఈభైరవస్వామియు, త్రిపురాంతకక్షేత్రమందలి త్రిపురాంతకేశ్వరుఁడు నీవంశమువారి కిష్టదైవతము లని గోచరించును. ప్రేమాభిరామకర్తయగు రావి

పాటి తిప్పన్నకుఁగూడ త్రిపురాంతకేశ్వరుఁ డిష్టదైవమని యూహించి త్రిపురాంతకోదాహరణకృతివలనఁ గానవగును. దివ్యక్షేత్రములందు జరుగుతిరునాళ్లలో యాత్రికులవినోదార్థమై పూర్వము నాటకప్రదర్శనములు మున్నగునవి గావించునాచార ముండెనని కొన్ని సంస్కృతనాటకములందలి ప్రస్తావనల వలనఁ దెలియుచున్నది. ఇప్పటికిఁ గొన్నిస్థలములలో నిట్టి యుత్సవసమయము లలో రాత్రులందు హరికథలు, భాగవతము, భామవేషము మున్నగు కాలక్షేప ములు జరుగుచుండుటచూచుచు నేయున్నాము. ప్రేమాభిరామము త్రిపురాంత కేశ్వరునితిరునాళ్లలోఁ బ్రదర్శనార్థమై రచియింపఁబడియుండును. అట్లేదాని ననువదించి మోపూరు భైరవస్వామి తిరునాళ్లసమయమునఁ బ్రదర్శింపఁజేయ వలెననెడిసంకల్పము వల్లభరాయనికి సహజముగ నుదయించియుండును. వల్లభ రాయనివీథినాటకములోని వని పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకర ములో నుదాహృతములయినపద్యములలో:—

"సీ. చంద్రఖండములతో సరివచ్చు ననవచ్చు విమలదంష్ట్రాప్రరోహములవానిఁ
బవడంపుఁ గొనలతోఁ బ్రతివచ్చు ననవచ్చుకుటిలకోమలజటాచ్ఛటలవాని
నింద్రనీలములతో నెనవచ్చు ననవచ్చు కమనీయతరదేహకాంతివాని
నుడురాజరుచులతో నొఱవచ్చు ననవచ్చు చంచన్మదాట్టహాసములవాని
గీ. సిగ్గుమాలిన మొలవానిఁ జిఱుతవాని, నెల్లకాలంబు మురికినాఁ డేలువాని
నర్థి మోపూర నవతారమైనవాని, భైరవునిఁ గొల్వవచ్చిరి భక్తవరులు."

అని యొకటి యున్నది. అది మనకు దొరికిన తాళపత్రప్రతిలోఁ గానరాదు. శిథిలమయిన యవతారికాభాగములో నది చేరియుండును. అది ప్రస్తుత ముద్రితగ్రంథములోని "మందారవారుణీమదఘూర్ణితాత్ముచే......" అనెడి 32-వ పద్యమునకుఁ గొంచెము ముందువెనుకల వ్రాయఁబడినదయియుండును. ఈపద్యములవలనను "ముదమున మల్కి నాటి..." అను గ్రంథాంతపద్యము వలనను మనమీవీథినాటకము భైరవస్వామియుత్సవసందర్భమునభక్తవినోదార్థ

ముగఁ బ్రదర్శింపఁబడుటకే రచింపఁబడియుండు నని సులభముగఁ గ్రహింపవచ్చును.

## గ్రంథరచనాకాలము - శ్రీనాథునిసాహాయ్యము

వల్లభరాయనికాలమున విజయనగరసామ్రాజ్యమును ప్రౌఢదేవరాయలు (క్రీ. శ. 1423—1445) పరిపాలించుచుండెను. అతనియాస్థానముననే గౌడడిండిమభట్టారకుఁడు, అరుణగిరినాథనామాంకితుఁడు, కవిసార్వభౌమేత్యాదిబిరుదములతో యశోడిండిమమును మ్రోగించుచుండెను. శ్రీనాథునకు యశోభిలాష మపారము, అప్పు డాతఁడు రాజమహేంద్రవరమున వేమ వీరభద్రారెడ్లయాస్థాన మలంకరించియుండెను. విద్యావివాదమున డిండిమభట్టారకుని జయించి యాతని కంచుఢక్కను బగులఁగొట్టించినఁగాని శ్రీనాథునకు నిద్రపట్టకుండెను. అందుచే నాతఁడు జైత్రయాత్రోన్ముఖుఁడై పలుచాట్లుపడి ప్రౌఢదేవరాయలయాస్థానమునఁ బ్రవేశమును గలిగించికొని డిండిమభట్టు నోడించి రాజుచేఁ గనకాభిషేకసత్కారాదులనొంది స్వదేశమునకు మరలివచ్చి కవిసార్వభౌముఁడయి విరాజిల్లెను. ఈవిజయనగరప్రయాణసందర్భముననే యాతఁడు ప్రౌఢదేవరాయసంస్థానప్రవేశమునకుఁ గావించిన ప్రయత్నములలో మార్గమధ్యమున వినుకొండలోఁగాని మోపూరులోఁగాని యాప్రాంతదేశమునకు రాయలప్రతినిధిగా భాండాగారాధ్యక్షుఁడుగా నున్న వల్లభరాయని సందర్శించియుండును. శ్రీనాథునియుద్యమమునకు హర్షించి వల్లభరాయఁడది కొనసాగుటకయి తనమిత్రులగు సంస్థానోద్యోగులు కొందఱకు సిఫారసుచేసియుండును. ఆసమాగమసమయముననే శ్రీనాథుఁడు వల్లభరాయనివలన నాతని క్రీడాభిరామరచనోద్యమమును విని యాతని యాదరానురోధమునఁ దానుకూడ నందుఁ దోడ్పడియుండును. చరచరపరుగులువాఱు కవితాధారగల శ్రీనాథున కిట్టిపని కెంతయో సేపు పట్టదు: కావున వల్లభరాయనితోనున్న యాకొలఁదిదినములలోనే శ్రీనాథుఁ డీకృతిరచనమునఁ దన

చేయువేసియుండును. స్వతంత్రముగఁగాని యనువాదరూపకముగఁగాని యొక రూపకరచనము గావించుసంకల్పము శ్రీనాథున కుండియుండదు. పైని జెప్పిన కారణములచే నీకృతిరచనాసంకల్ప మసలు వల్లభరాయునిదే యని మనము సులభముగఁ దెలిసికొనఁగలము. అవతారికాభాగము వల్లభరాయస్తుతిసంకలితము, తద్వంశవర్ణనాదికము, గ్రంథాంతమందలి యాశీర్వాదపద్యము కేవలము శ్రీనాథకృతములే యని మనము భావింపఁదగును. ఇఁకఁ గథాభాగమునందును శ్రీనాథుని సిద్ధహస్తము స్వల్పముగఁగాక యతిమాత్రముగ-వల్లభరాయరచనములు కొన్నియున్నను వానిని గుర్తింపరాకుండఁ గ్రమ్మివైచు నంత యెక్కువగ నెలకొనినట్లు కాన నగును. శ్రీనాథుని యితరకృతులందలి పద్యపాదములు, ఆతనిరచనలతోఁ బ్రత్యక్షసామ్యముగల సంవాదములు, పదప్రయోగములు నిందు నెక్కుడుగ నెక్కొనియున్నవి. వానిమాట యట్లుండ నీక్రిందిదృష్టాంతములు శ్రీనాథున కీకృతిరచనమునఁగల సంబంధమును రాద్ధాంత మొనర్పఁగల వని యెట్టివారును నంగీకరింపక తప్పదు.

శ్రీనాథుఁడు భీమేశ్వరపురాణము నాంధ్రీకరించి వేమవీరభద్రరెడ్లమంత్రి యగు బెండపూడి యన్నయ్య కంకిత మొనర్చెను. అన్నమంత్రి శా|| శ|| 1350 (క్రీ|| శ|| 1428)లో భీమేశ్వరాలయమునకు గోపురమంటపములఁ గట్టించినట్లు లచ్చట నొకశిలాశాసన మున్నది. ఈధర్మకార్యప్రశంస భీమేశ్వరపురాణావతారికలోఁగూడ నుదాహృతమగుటచే నాగ్రంథము క్రీ|| శ|| 1428-వ సం||తరువాత రెండుమూఁడువత్సరములలో రచింపఁబడెనని తలంపవచ్చును. సంస్కృతభీమేశ్వరపురాణములో, వ్యాసుఁడు కాశినుండి వెడలి వచ్చుచు మార్గమునం దగస్త్యమహర్షిని గలిసికొని యాతనితో భీమేశ్వరసేవార్థమై దక్షారామపురప్రవేశమునకయి శుభముహూర్తమును జింతించు సందర్భములో అగస్త్యుఁడు వ్యాసునితోఁ బల్కినట్లుగా నీక్రిందిశ్లోకము లున్నవి.

'ఉషస్స్యాద్గార్గ్యసిద్ధాంతశ్శకునంతు బృహస్పతేః,
త్వన్మతంచిత్తనైర్మల్యం విప్రవాక్యం హరేర్మతం
కీర్తనీయోఽభి జిత్కాలస్సర్వసిద్ధాంతసమ్మతః"

తక్కిన పాదములు ప్రథమపురుషలో నుండఁగా మూఁడవ పాదము నందు మధ్యమపురుషలో నున్న వ్యాసమతమునుగూర్చి "నీదుమత మెన్నఁగ మనఃప్రసాదగరిమ" అనురీతి నేదోవిధమునఁ జేర్కొనుట యుచితముగా దనుతలంపుతో శ్రీనాథుఁడు దానిని బూర్తిగా విడిచి తక్కిన పాదముల ని ట్లనువదించినాఁడు.

"గార్గ్యసిద్ధాంతమతముషఃకాలకలన,శకునమూనుటయదిబృహస్పతిమతంబు
విప్రజనవాక్య మరయంగ విష్ణుమతము,సర్వసిద్ధాంత మభిజిత్తు సమ్మతమగు."

భీమేశ్వరపురాణమందలి యీపద్యమే యందు విడిచినవ్యాసమతమును మూఁడవపాదమునఁ జేర్కొనుచు నందలినాల్గవపాదమును విడిచి దాని స్థానమున మూఁడవపాదమును నిలుపుచు, క్రీడాభిరామమునఁ గథాపాత్రములు గోవిందమంచనశర్మ, టిట్టిభసెట్టి యేకశిలానగరప్రవేశమున కుషఃకాలముహూర్తము సమ్మతముగా నుండు నని సంప్రతించుకొనుసందర్భములో నీక్రిందివిధమునఁ గూర్పఁబడినది.

"గార్గ్యసిద్ధాంతమత ముషఃకాలకలన
శకున మూనుట యది బృహస్పతిమతంబు
వ్యాసమతము మనఃప్రసాదాతిశయము
విప్రజనవాక్య మరయుఁగ విష్ణుమతము."

వ్యాసుని దక్షపురప్రవేశమున కగస్త్యుఁడు నిర్ణయించినది యభిజిన్ముహూర్తము. ఆంధ్రనగరప్రవేశమునకు మంచనశర్మ నిశ్చయించునదియుషఃకాలముహూర్తము. కావున నిచ్చట నౌచిత్యమును బాటించి భీమేశ్వర పురాణమున దా ననువదించినపద్యమునే యుచితమయినమార్పుతో సందర్భ

శుద్ధి కనుగుణముగఁ గ్రీడాభిరామమున నిట్లు పొసఁగించుట శ్రీనాథుని పనియే యని సహృదయులకుఁ జెప్ప నక్కఱలేదు. ఇప్పట్టున సంస్కృత భీమేశ్వరపురాణమందలి శ్లోకపాదములతోనే మఱొకశ్లోకమును రావిపాటి త్రిపురాంతకుఁడు ప్రేమాభిరామమున రచించియుండు నని క్రీడాభిరామ పద్యము దానికి సరియైనయనువాద మని విజ్ఞులు తలంపఁజాలరు.

శ్రీనాథుఁడు ప్రాకృతభాషయందలి శాలివాహన (గాథా) సప్తశతిని దననూత్నయౌవనదశలోఁ దెలిఁగించినట్లు కాశీఖండావతారికయందలి "నూనూగుమీసాల నూత్నయౌవనమున శాలివాహనసప్తశతి నొడివితి" అను పద్యపాదమువలన వ్యక్తమగును. అది మన కింతదనుక లభింప లేదు. కాని మూలమగు ప్రాకృతకావ్యము దొరకినది. అందలి రెండుశ్లోకముల (సంస్కృత చ్ఛాయతో) నుదాహరించుచున్నాను.

"ఝంఝావాతోత్తృణితే, గృహే రుదిత్వా నిస్సహ నిషణ్ణాం
దర్శయతి గతపతికాం, విద్యుదుద్యోతో జలధరాణామ్."
విక్రీణీతే మాఘమాసే, పామరః ప్రావరణం బలీవర్దేన
నిర్ధూమ ముర్మురనిభౌ, శ్యామల్యాః స్తనౌ పశ్యన్."

క్రీడాభిరామమందలి "పటుఝంఝాపవనోత్తృణాలయములో(...ప. 60) "మాఘమాసంబు పులివలె మలయుచుండ...(ప. 262) అనుపద్యములు వరుసగఁ బయిశ్లోకముల కనువాదము లని గోచరింపక మానదు. శ్రీ ప్రభాకరశాస్త్రిగారే వీనిని గుర్తించిరి. తనశాలివాహనసప్తశతిలోని పద్యముల నే సందర్భోచితములగుతావుల శ్రీనాథుఁ డిందుఁ జేర్చె ననుట కభ్యంతర ముండరాదు.

శ్రీనాథుని యితరకృతులందును నీగ్రంథమందును సరిసమానముగను సన్నిహితసాదృశ్యము గలిగియు నున్నపద్యపాదములు, సమాసములు, సంవాదములు, ప్రయోగములు పెక్కులు కావచ్చు నని మున్నే చెప్పితిని. ప్రభాకరశాస్త్రిగారు మఱున్నగువారు వానిని విపులముగఁ బ్రదర్శించిరే

యున్నారు. గ్రంథవిస్తరమగునని మచ్చునకయిదాఱుమాత్రమే యీక్రిందఁ జూపుచున్నాను.

1. కద్రూమహాదేవి గారాపుసంతతి మధుకైటభారాతి మడుఁగుఁ బాన్పు. (క్రీడా.)

ఏయింతులకుఁ బుట్టినిల్లు దుగ్ధాంబోధి మధుకైటభారాతి మడుఁగుఁబాన్పు. (కాశీఖండము.)

2. గొజ్జంగిపూనీరు గులికి మేదించిన గంగమట్టి లలాటకమునఁ దీర్చి. (క్రీడా.)

" " " " కమ్మకస్తురి మేనఁ గలయ నలది. (కాశీ.)

3. జటిగొన్న వెలిపట్టు జన్నిదంబులలుంగయొంటులు వాయంగ నఱుత వైచి. (క్రీడా.)

" " " " తోడ రత్నాలతారహారము ధరించి

శివరాత్రిమాహాత్మ్యము.

4. వ్రాలెక్ దిక్కులు భానుభావ్యతికరప్రక్రీడదర్కోపల
జ్వాలాజాలజటాలజాంగలతటీవాచాలకోయష్టులై ... (క్రీడా.)
మాళింగోహాళి సంఘటించినక్రియక్ ......వీకం గాసె బిట్టెండయా
ప్రాలేయాహితసంప్రదీప్తకిరణప్రక్రీడదర్కోపల
జ్వాలాజాలజటాలజాంగలతటీవాచాలకోయష్టియై (హరవిలాసము.)

5. చరణాంగుళీకుటిలనఖశిఖాకోటికుట్టనమున (క్రీడా.)
కుటిలచంచూపుటకోటికుట్టనమున
కుటిలపాటలజటాంకురకుట్టనంబున (కాశీ.)

6. జారచోరమహాధూర్తచక్రవర్తి (నైషధము.)
దేవవేశ్యాభుజంగుఁడు తెలుఁగుభర్త (క్రీడా.)
జారచోరాదిధూర్తవిహారభూమి (నైషధము.)
సంతతము దేవవేశ్యాభుజంగుఁ డతఁడు (భీమేశ్వరపురాణము.)

శ్రీనాథవల్లభరాయలు వేర్వేఱుకాలములవారు కారు. అందు చే వారి గ్రంథములు దేశమున వ్యాప్తినొందినతరువాతదానినిజూచియొకరికృతులనుండి మఱొకరు గ్రంథచౌర్యప్రాయములగు సూలానుకరణము లొనర్చిరనునూహల కవకాశ మేమాత్రము లేదు. వారు సమకాలికులవుట చేఁబైనిజెప్పినసిర్ణయమే సర్వవిధములసంగతముగా నుండును. కాశీఖండరచనము శ్రీనాథుఁడు విజయనగరాస్థానమునఁ గనకాభిషేకమొంది రాజమహేంద్రవరమునకు మరలివచ్చిన యనంతరమే క్రీ. శ. 1440 ప్రాంతమునఁ గావించియున్నాఁడు. కావున భీమఖండ కాశీఖండరచనముల నడుమకాలమున విజయనగరప్రయాణసందర్భమునసే శ్రీనాథుఁడు వల్లభరాయని సందర్శించి క్రీ. శ. 1435-వ సం|| ప్రాంతమున నాతని క్రీగ్రంథరచనమున సాయపడె నని నిర్ణయింపనగును.

## ప్రేమాభిరామము - క్రీడాభిరామము

దీనికి మూలగ్రంథ మగు ప్రేమాభిరామము మనకు దొరకలేదు. కాని క్రీడాభిరామమందలి "శీతకాలంబు కడిమాడ సేయఁ గుడుచు"—(ప. 56) "పరిపాటీఖర్వఖర్జూపరతి"—(ప. 110) "దొరసెమునందు చుట్టుకొని"—(ప. 289) అనుపద్యములకు వరుసగ మూలము లనఁదగు నీక్రిందిశ్లోకములు ఛందోలంకారగ్రంథములలో నుదాహృతములై యున్నవి. అవి ప్రేమాభిరామములోని వనియే తలంపఁదగును:

"తరుణం సర్షపశాకం నవౌదనం పిచ్ఛిలానిచ దధీని
స్వల్పవ్యయేన సుందరి! గ్రామ్యజనోమృష్టమశ్నాతి."

(వృత్తరత్నాకరవ్యాఖ్యనుండి)

"పృథులజఘనభారం మందమాందోలయన్తీ
ప్రచలితకుచకుంభా సంభ్రమత్కర్ణపూరా
మృదుచలదలకాంతా ముగ్ధపుంభావలీలా
మభినయతిహారిద్రా పేషణచ్ఛద్మనైషా"

(పెదకోమటి వేమారెడ్డి సాహిత్యచింతామణినుండి)

"పరారి సందర్శిత సన్నివేశా పరుత్పరాభూతపయోజకోశా
ఇహైషమస్తాళఫలోపమానా స్తనా కియస్తా పురతో భవేతామ్"
(పెదకోమటి వేమారెడ్డి సాహిత్యచింతామణినుండి)

క్రీడాభిరామమువలెఁ ప్రేమాభిరామముగూడ వీథీరూపకమే యై యుండు నని దాని కిది కొంతవఱకుఁ జేరిక గల యనువాద మనియే తలంపఁ దగు నని మున్నే చెప్పియుంటిని.

## వీథీనాటకలక్షణములు

దృశ్యకావ్యములకు రూపకము లని గీర్వాణాలంకారికులవ్యవహారము. అవి నాటకము, ప్రకరణము, భాణము, ప్రహసనము, డిమము, వ్యాయోగము, సమవాకారము, వీథి, అంకము, ఈహామృగము అను దశవిధభేదములతోఁ బరిగణింపఁబడినవి, ఇందు భాణము, వీథి యించుమించుగ సమానలక్షణములు గలవి. కావున నీ యుభయరూపకలక్షణంబులనుగూడ మద్గురువర్యులు శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు రచించిన యాంధ్రదశరూపకమునుబట్టి యుదాహరింతును.

1. (౧) ఏకాంకంబు, విటైకపాత్రవర్ణితకల్పితధూర్తచరితంబు, భారతీవృత్తికంబు, భాణంబు (౧) సంబోధనోక్తి ప్రత్యుక్తు లాకాశభాషితంబులు. భాణంబున నొక్కటియే యంకము. ఇతివృత్తము కల్పితము. అది ధూర్తచరితముగా నుండవలయును. తానుగాని యితరులుగాని యనుభవించినదిగా నుండునట్టి యాధూర్తచరితమును సమర్థుఁడును విద్యావంతుఁడు నగు విటుఁ డను నొక్కపాత్రమే ప్రయోగింపవలయును. ఇందుఁ దఱచుగా భారతీవృత్తి యుపయోగింపఁదగును. ఇం దితరులను బిలుచుట, యడుగుట, వినుట మొదలగునవి "ఓయీ! ఏమంటివి? ఇట్లంటివా?" యనున ట్లాకాశవచనములచే జరుగఁదగును.

భాణతుల్యంబు, త్రయోదశాంగంబు, సూచనీయశృంగారంబు, ఏకద్విపాత్రప్రయోజ్యంబు వీథి. వీథివలె నిది యంగములకు మార్గ మగు

చున్నదిగాన వీథి యనఁబడును. ఇది భాణతుల్య మనుటచే నితివృత్తము కల్పిత మనియు నొక్కటియే యంక మనియు సాంగములగు ముఖనిర్వహణ సంధులు లాస్యాంగములు నుపయోగింపఁదగు ననియు తెలియుగునది. మఱియు, ఉద్ఘాత్యము, అవలగితము, ప్రపంచము, త్రిగతము, ఛలనము, వాక్కేళి, అధిబలము, గండము, అవస్యందితము, నాళిక, అసత్ప్రలాపము, వ్యాహారము, మృదవము అను వీథ్యంగములు పదుమూఁడు నిం దుపయోగింపఁదగును. కైశికీ వృత్తితోఁగూడిన శృంగారరసం బిందు ముఖ్యముగా సూచింపఁదగును. రసాంతరంబులుగూడ నౌచిత్యమున కనుగుణముగా సూచింపఁదగును. ఇం దొక్కటిగాని రెండుగాని పాత్రములు యథాసంభవముగా నుండవలయును. గ్రంథవిస్తరభయంబున వీథ్యంగములు పదుమూఁటికి లక్షణము లుదాహరింప నైతిని. వానిని దశరూపకమున వివరముగఁ దెలియనగును.

## కథావస్తువు

పై నిర్వచనములఁబట్టి క్రీడాభిరామమున వీథిలక్షణము లెంతవఱకు నిర్వహింపఁబడినవో పాఠకులు పోల్చికొనఁదగును. ఇందు శృంగారమేగాక తక్కినరసములుగూడఁ జాలవఱకు సందర్భోచితముగఁ బోషింపఁబడినవి. కావుననే "గణనకెక్కిన దశరూపకములయందు వివిధ రసభావభావనవీథి లెస్స" అని కృత్యవతరణికాపద్యముననే చెప్పఁబడినది. కాకతీయసార్వభౌముఁడగు రెండవ ప్రతాపరుద్రునికాలమునందలి యాంధ్రనగర(ఏకశిలానగర)స్థితి, యానాఁటి సాంఘికపరిస్థితులు, జానపదజీవనము, సంఘదురాచారములు, వినోదములు మున్నగునవి యిం దితివృత్తముగాఁ గయికొనఁబడినవి.

గోవిందమంచనశర్మ యను కౌసల్యాటిద్విజుఁడు ఓరుగంటిలోఁ గామమంజరి యను మాఱుమనువు మడంతికి మిండఁడై యుండెను. కార్యాంతర వ్యాసంగమునఁ గొంతకాల మాతఁడు దేశాంతరగతుఁడయి టిట్టిభసెట్టి యను కోమటినెచ్చెలికానితోఁ బురమునకు మరలివచ్చెను. వారిరువురు నొకనాఁటి

వేకువను పురమువెలుపల నున్న వెలిపాళెముమీఁదుగా మేదరవాడఁ జొచ్చి యటనుండి హట్టమార్గమునఁ జని యాయావీథులందుఁ గానవగు వినోదములు, ఆటలు, కోడిపందెములు, పొట్టేళ్లపోట్లాటలు, గ్రామదేవతలగుళ్లు, జాతరలు, వంటపూటిళ్లముచ్చటలు, వేశ్యవాటికలు మున్నగునవి చూచి వర్ణించుచు సాయంకాలమునకు నార్యవాటికకేఁగెదరు. అంత మంచనశర్మ తనరాక నొకతంబళిసానిచే రహస్యముగఁ దనమిండకత్తె కామమంజరి కెఱిఁగించి యామెను దాను విడిసియున్న యాపూజారిసానియింటికి రప్పించును. కొంతపణ మొసంగి యా తమ్మడిసానికూఁతుతోడి కూటమును కోమటిచె సంగడికానికి సంఘటించును. మిత్రు లిరువురు చందురునకు వలరాజునకు గొజ్జఁగిపూసెటితో నర్ఘ్య మొసంగి పండువెన్నెలలోఁ దమననుపుఁగత్తెలతో నారేయి సుఖక్రీడలఁ దేలియాడెదరు.

ఏకశిలానగరము నేఁడు పాడఱి తనతొంటివైభవమును గోల్పడియున్నది. ఈకృతిని సావధానముగఁ జదువువారు నాఁటిసన్నివేశములను గుర్తించి యప్పటిపట్టణాకృతిని కొంత చిత్రింప నేర్తురు. అందుచే నిది చరిత్రకారుల కెంతయు నుపయోగకరము.

## క్రీడాభిరామవిశిష్టత

పయినిఁజెప్పినవిధమునఁ బదునాల్గవశతాబ్దినాఁటి ఆంధ్రనగరస్థితి, సాంఘికాచారవ్యవహారము నిరూపించుచుఁ జరిత్రజ్ఞుల కుపకరించు తెఱఁగు ననేకాక, వాఙ్మయరంగమున మఱి యితరవిధములఁగూడ నీకృతికిఁ బ్రత్యేక విశిష్టత గలదు. కేవలము శృంగారరసప్రధానము లయి యించుమించుగ నేక రూపకము లగు కథాసంవిధానములతోను వర్ణనలతోను నిండియుండి మదులకు విసువుఁగొలుపు పూర్వప్రబంధములను బురాణకథలను జదువువారి కితివృత్త వైలక్షణ్యము, విషయవైవిధ్యము, వర్ణనావైశద్యము మున్నగుగుణములతోఁ దుళ్లింగలించు నీలఘుకృతి యాఱట గలిగించి వినోదకరముగా నుండఁగలదు. ఆయాసన్నివేశములందుఁ బ్రసక్తము లయిన వేర్వేఱువిషయములు-వివిధజాతి

స్త్రీల విలాసకృత్యములు, హావభావములు, జూదగాండ్రచర్యలు, పాములాటు, కోళ్ల పొట్టేళ్ల పోరితములు, పల్నాటివీరులవృత్తములు, మైలారభటులసాహసికములు, జాతరలు, వేశ్యాగృహములందలి వినోదములు మున్నగువానినిగూర్చి చేసిన వర్ణనలలో నిందలిపద్యములలో వలను మెఱసివఱలుచున్నది ప్రత్యక్షత యను ప్రత్యేకగుణము, దేని కది కనులఁ గట్టినట్లు, చిత్తరువున లిఖించినట్లు పాఠకులమనఃఫలకముల హత్తుకొనుచుండును. శ్రీ వేమూరి విశ్వనాథశర్మగారు ముఖ్యముగా దీనినిబట్టియే యిది వల్లభరాయరచనగాని శ్రీనాథకృతము గాదని, వాదించిరి. శ్రీనాథుని యేగ్రంథమున నెట్టిపట్టుననైనను పదునగ మూఁడువందలపద్యములఁ జదివిచూచినను నిట్టి వైలక్షణ్యము, వైశద్యము నందు గోచరింపనేర దని వారియాశయము. అట్లు తలంచుట సరి గాదని నా యభిప్రాయము. శ్రీనాథుని యితరకృతులు చాలవఱకుఁ బురాణాంధ్రీకరణములో, సంస్కృతప్రబంధానువాదములో యయియున్నవి, అయినను నతఁడుఁ గూడ స్వతంత్రించి వీలయినతావుల నాతఁడు తనవర్ణనలలోఁ ప్రత్యక్షతా గుణము (వైశద్యము) మెఱయింపక పోలేదు. పాలకురికి సోమనాథ, తిక్కన, నాచనసోమనాథులకృతులఁ జక్కఁగ జీర్ణించికొనియున్న యీనాథకవిరాజున కీగుణవిశేషము ముగ్గుఁబాలతోనే యలవడియున్నది. క్రీడాభిరామమునకు, శ్రీనాథుని యితరకృతులకు శర్మగారు సూచించెడి విభేదవిలక్షణతలకుఁ గారణ మాయాకృతులయందలి కథావస్తువులలోని భేదమేగాని మఱొకటి కాదు. విపణివీథులలో వివిధరుచులుగలవస్తువులు దొరకునట్లే, వివిధరసభాసభావనల కాలవాలములగు వీథినాటకరచనము లేకవిక్లృప్తములయినను నందిట్టి విషయ వైవిధ్య మవశ్యము గోచరింపక మానదు. అసలు వీథిలక్షణమే యట్టి దని ముందే చెప్పియుంటినిగదా !

క్రీడాభిరామము ముద్రింపఁబడుటకుముందు, "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" యను గౌరవమును మనభాషకుఁ బట్టముగట్టినది శ్రీకృష్ణదేవ రాయసార్వభౌముఁడని యాతని యాముక్తమాల్యదయందలి "తెలుఁగదేల

యన్న దేశంబు తెలుఁ గేను తెలుఁగువల్లభుండ ...... దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" యనుపద్యమునుబట్టి మనవారు తలంచుచుండిరి. కాని వాస్తవముగ దీని నాపాదించినది శ్రీనాథవల్లభరాయలేగాని శ్రీకృష్ణదేవరాయలు కాదని, ఈ కృతియందలి "జననిసంస్కృతంబు సకలభాషలకును దేశభాషలందుఁ దెలుఁగు లెస్స. (ప. 37)" అనుపద్యమందలి రెండవపాదమునే, శ్రీకృష్ణదేవరాయ లనువదించె నని తెల్లము కాఁగలదు. కావున నెట్లుచూచిననునీ కృతిరత్న మాంధ్రభాషాభిమానులకుఁ గొంగుబంగారమువంటి దని చెప్పకతప్పదు.

## పూర్వముద్రణములు - ప్రస్తుతముద్రణము

మొట్టమొదట నీకృతిని 1909-వ సంవత్సరమున శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు, అందఱకు నందుబా టగునట్లు స్వల్పమూల్య మేర్పఱచి, ముద్రించి యుపకరించిన సంగతి మునుముందే ప్రశంసించియుంటిని. అప్పటి నిబంధనములఁబట్టి యశ్లీలతాజుష్టములగు కొన్నిపద్యపాదములను, పద్యములను మాత్రము వారు ముద్రింపక ...అని బొట్లుపెట్టి విడిచియుండిరి. ఇంతకు నవి—ప. 79 లో 3-వ పాదములోఁ గొంత, ప. 80 లోని యెత్తుగీతి యందు 3-వ పాదములోఁ గొంతు, ప. 169 లో 3, 4 పాదములు, ప. 187 ప. 200 లో 4-వ పాదము. ప. 210, 211 లు, ప. 215లోని యెత్తుగీతియందు 1, 4 పాదములు, ప. 216 లోఁ గొంతభాగము—స్వల్పమాత్రమే యైయున్నవి. తరువాత 1929-వ సంవత్సరములో శృంగారగ్రంథమాలికవారి పునర్ముద్రణము చక్కనిదళసరికాగితములపయి పెద్దయక్షరములతో రామకృష్ణకవిగారు విడిచిన భాగములనుగూడఁ జేర్చి ప్రభాకరశాస్త్రిగారిపీఠికతో ప్రకటితమయినది. కాని పదిరూపాయిలమూల్యములోఁ బ్రమాణపత్రమును బంపెడిప్రాజ్ఞులకుమాత్రమే యనెడురతిబంధ మొకటి దానికిఁ జేర్పఁబడినది అందుచే సాజముగ జ్యేష్ఠాదేవి జ్యేష్ఠపుత్త్రులగు పండితులు పలువుర కిది దుర్లభమయ్యెను. ఈపరిస్థితికిఁ బ్రధానకారణము క్రీడాభి

రామ ప్రథమముద్రణమున విడిచిన స్వల్పభాగముల నిందుఁ జేర్చుట కాదు. శ్రీనాథుఁడు శృంగారి యని నిరూపించుటకుఁగాను ప్రభాకరశాస్త్రిగారు నా శృంగార శ్రీనాథవిమర్శనములో "శ్రీనాథునిశీలము" గుఱించి నే వ్రాసిన యంశములకు సమాధానమగు నని తాము సేకరించియుంచిన బూతుపద్యములు (చాటువులు) లెక్కకు మిక్కిలిగఁ దమపీఠికలో నుదాహరించుటయే దీనికి మూలకము. అంత డబ్బిచ్చి కొనలేక పండితులు పలువురు హతాశులైరి. మఱికొందఱు బూతుపద్దెముల కింత విలువయా యని పెదవి విఱిచిరి. రామకృష్ణకవిగారిముద్రణము సరిగాఁ బరిష్కృతము కాలేదని, ప్రభాకరశాస్త్రిగారు తాము తంజావూరు కేఁగి యప్పటికే తమవాతున కలుగుచున్న తాళపత్త్రప్రతిని బరిశోధించి సరియైనపాఠములను గుర్తించితి మనికూడ వారిపీఠికలో వ్రాసినారు. కాని వీరిపునర్ముద్రణపాఠములుగూడఁ గొన్ని యెడలఁ గవిపాఠములు కావేమో యనుసందియముల కెడమిచ్చుచున్నది. ఇందుచే నీగ్రంథము నందఱ కందుబాటగునట్లు నిప్పటిపరిస్థితుల కనుగుణముగ సరసమయిన మూల్య మేర్పఱచి పునర్ముద్రణము గావించు నావశ్యకతను హెచ్చరించుచు, దానిని నిర్వహించుము ప్రకాశకుల యుపయోగమునకుఁ బర్యాలోచనమునకుఁగాను గొన్ని పాఠములనుగూర్చి చర్చించుచు నీనడుమ ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక (సం. 40 సం. 4-6 లో "క్రీడాభిరామపాఠములు" అను వ్యాసమును బ్రకటించియుంటిని. దానిని జూచినమీఁదట సుప్రసిద్ధ సంస్కృతాంధ్ర గ్రంథప్రకాశకులు, భాషోద్ధారకులు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు, తా మీకృతి కిట్టిముద్రణము (Popular edition) గావించ నుంటిమనియు నేను సూచించుపాఠముల నెల్లఁ దమకుఁ దెలియఁజేయుమనియు నాదేశించిరి. తత్ఫలితముగనే యీప్రస్తుతముద్రణము వెలువడినది. నా దృష్టిలో నొండురెండుపట్టుల (54-వ పద్యము చివరనున్న "కాహళికా" వంటివి) రామకృష్ణకవిగారి ముద్రణమందలి పాఠములే ప్రభాకరశాస్త్రిగారి పునర్ముద్రణపాఠములకన్నఁ దత్తత్సందర్భములఁబట్టి సరసతరములుగఁ గాన్పించి

నవి. అట్టియెడల నీముద్రణమున వానినే స్వీకరించితిని. ఆయాపద్యములలో నేఁ గైకొనిన క్రొత్తపాఠములకు పుటలయడుగున పూర్వముద్రణపాఠములను గూడఁ గనఁబఱచితిని. ప్రభాకరశాస్త్రిగారి సవరణపాఠములే యిందుఁ గైకొన్నతావులఁగూడ వానికి రామకృష్ణకవిగారిముద్రణమందలి పాఠముల నడుగునఁ జూపితిని. కావున నిట్టియెడలఁ బాఠకు లాయాపాఠభేదముల యౌచిత్యానౌచిత్యములఁ దామే పర్యాలోచించి తమ కుచితము లని తోఁచి నవి గ్రహింపఁదగును. సందేహాస్పదములుగ నున్నపాఠము లింకను మఱికొన్ని యున్నను గవిహృదయ మిదమిత్థముగ నిరూపింపఁజాలమి వానికి మార్పులు సూచింపనైతిని. మచ్చునకయి శాలివాహనసప్తశతి శ్లోకమున కనువాద రూపకముగ నున్న 30-వ పద్యము చిత్తగింపుఁడు. 'దర్శయతిగతపతికాం విద్యుదుద్యోతో జలధరాణామ్" అను శ్లోకపాదములకు పద్యమందలి 3, 4 పాదము లెంతవఱకు సరియైన యనువాదమో యెఱుఁగరాకున్నది. "జోరు గాలిచే నింటిగడ్డి కప్పెగిరిపోవఁగా దుఃఖించుచు మంచముపయి నొక్కతయ నిద్రించుచున్నపాంథవనితను, మేఘములయొక్క విద్యుత్ప్రకాశము (బయటి వారికి) గన్పడఁజేయును." అని శ్లోకభావ మయియుండునేమో? అట్టిచో "జలధరాణామ్" అనుటకు "ధారాధరశ్రేణికిన్" అని కిషష్ఠితోడి యనువాదము మూలానుగుణమగునా? గర్జావచః ప్రౌఢిమతో మెఱపుకాంతు లాకాంతను జలధరపంక్తులకుఁ జూపుటయేమి? ఇందేమయిన సారస్యమున్నదా? ప్రభాకరశాస్త్రిగారిపీఠికలో నీపద్యశ్లోకములనుగూర్చి యున్నవివరణముగూడ విశదముగ లేదు. "గర్జావచః ప్రౌఢిమ స్తటిదుద్యోతతఁ జూపునట్టి నడురే ధారాధరశ్రేణికల్" అనునది కవిపాఠమై యుండునేమో యని నాయనుమానము. అయినను నట్టిమార్పుతోఁ బద్యమును ముద్రింప సాహసింపక పూర్వముద్రితపాఠము నీముద్రణమునఁగూడ గ్రహించితిని. విజ్ఞులు సరియైన పాఠముల నిర్ణయింతురుగాక! పరిషత్పత్త్రికలోని నాపూర్వోక్తవ్యాసము ప్రకటితమయినతరువాత, కృష్ణామండలమందలి ముక్త్యాలలో శ్రీప్రభాకర శాస్త్రిగారిగ్రంథములఁ బ్రకటించుట కేర్పడిన మండలి యొకటి రు.5-0-0లు

మూల్యముతో శాస్త్రిగారిపీఠికతో నున్న శ్రీడాభిరామమునకుఁ బునర్ముద్ర
ణము వెలువరించినట్లు విన్నాను. పలువుర కావెలకూడ హెచ్చుగనే తోఁచెడి
నని తలంతును. కొన్ని కఠినపదముల కర్థవివరణ మిందుకనుబంధముగఁ గూర్చి
తిని. విశేషకృషియొనర్చి పూర్వముద్రణముల నిర్వహించిన శ్రీరామకృష్ణ
కవిగారికి, ప్రభాకరశాస్త్రిగారికి నా కృతజ్ఞతాభివందనములు. అందఱ కందు
బాటగు రీతిని ప్రస్తుతముద్రణ మొనరించిన భాషాభిమానతత్పరులు శ్రీ వేంక
టేశ్వరశాస్త్రులుగారికిఁ బరమేశ్వరుఁ డాయురారోగ్యసౌభాగ్యములఁ బ్రసా
దించుఁ గావుత మని ప్రార్థించుచున్నాను.

కాకినాడ
విజయ చైత్ర శుద్ధ పంచమీ
భృగువారము.

ఇట్లు,
భాషా సేవకులపాదరేణువు,
**బండారు తమ్మయ్య.**

శ్రీ

# క్రీడాభిరామము

---

## కృత్యవతరణిక

తే. గణనకెక్కిన దశరూపకములయందు
వివిధరసభావభావన వీథి లెస్స
యేకవీంద్రుఁడు రచియించె నీప్రబంధ
మనుచు మీరానతిచ్చెద రైన వినుఁడు. 1

## కృతికర్తవంశవర్ణన

సీ. అఖిలప్రపంచంబు నన్యథా కల్పించెఁ బటురోషరేఖ సాఫల్యమొందఁ
ద్రైశంకవంబైన తారకామండలం బాకాశమార్గంబునందు నిల్పె
మాలినీతీరనిర్మలసైకతములలో మేనకాప్సరసతో మేలమాడె
నామ్నాయమాత గాయత్రీమహాదేవిఁ బ్రణుతించి బ్రహ్మర్షిపదముఁ గాంచె
తే. నెవ్వఁ డాతండు సామాన్యఋషియె తలఁపఁ
దాటకాకాళరాత్రికి దాశరథికిఁ
గాలకంధరకోదండఖండనునకుఁ
గార్ముకాచార్యవర్యుండు గాధిసుతుఁడు. 2

స్ర. ఆవిశ్వామిత్రగోత్రం బనుజలనిధి యాహ్లాదముం బొందుచుండన్
భూవిఖ్యాతప్రభావాభ్యుదయుఁ డుదయముం బొందె *మంచన్నకీర్తుల్,

---

*నాచంద్ర.

ద్యావాపృథ్వ్యంతరాళాంతరముల నతినిస్తంద్రచంద్రాతపశ్రీ
ధావళ్యస్ఫూర్తి లక్ష్మీతరళతరకళాధాళధళ్యంబు సూపన్. 3

శా. ఆమంత్రీశ్వరుకూర్మినందనుఁడు చంద్రామాత్యుఁ డంభోజభూ
భామారత్నపయోధరద్వయతటప్రాలంబనైపథ్యము
క్తామాణిక్యనిభాభిరూప్యపదవాక్యప్రౌఢసాహిత్యవి
ద్యామాహాత్మ్యవిలాససమ్ముదితవిద్వన్మానసుం డిద్ధరన్. 4

శా. కర్ణాటక్షితినాథుఁ డైన ప్రౌఢబుక్కక్ష్మాపదేవేంద్రు న
భ్యర్ణామాత్యుని దానఖేచరునిఁ జంద్రాధీశు బంధుప్రియున్
వర్ణించున్ గవికోటి శంకరజటావాటీతటాంతర్నదత్
స్వర్ణద్యుంబుతరంగరింఖణఁసత్సాహిత్యసౌహిత్యయై. 5

క. ఆచంద్రమంత్రిమణికిని, బోచాంబారత్నమునకుఁ బుట్టెను బుధర
క్షాచణుఁడు మంచనార్యుఁడు, వాచస్పతిసదృశబుద్ధివైభవుఁ డగుచున్.

గీ. మంచనార్యుతిప్పమకును సుపుత్రులు
నలువు రెన్న సింగనయును దిప్ప
నయును మల్లనయును నయనీతిసత్కళా
న్వితుఁడు చెన్నమంత్రివిభుఁడు నన గ. 7

గీ. సింగనామాత్యసుతుఁడు సుస్థిరగుణుండు
మానినీమన్మథుఁడు చంద్రమంత్రివరుఁడు
వెలసె వైభవముల దేవవిభునిఁ బోలి
సకలబుధతతి యెల్లను సంస్తుతింప. 8

క. మిరుతూరివిట్టమంత్రీశ్వరుతనయ వరించె మల్లసచివాగ్రణి శం
కరుఁ డద్రిరాజనందనఁ, బరిణయ మగుభంగి నధికభాగ్యోన్నతుఁడై. 9

ఉ. మల్లనమంత్రికిం ద్రిపురమాతరళాక్షికిఁ గాంతిరోహిణీ
వల్లభు లాత్మసంభవులు వల్లభలింగనతిప్పనక్షమా

వల్లభమంత్రిశేఖరులు వారవధూజనపుష్పభల్లులు
త్ఫుల్లయశోవిభాసితులు పుణ్యులు సింగనభైరవేంద్రులున్. 10

వ. అందు. 11

సీ. తారకామందారతారాచలంబులతో రాయు నెవ్వానిచారుకీర్తి
భావసంభవభద్రదేవేంద్రసూనుల మఱపించు నెవ్వానిమహితమూర్తి
జీమూతవాహన శిబి సూర్యతనయుల ధట్టించు నెవ్వానిదానశక్తి
భార్గవగార్గ్యగీష్పతిమతిప్రౌఢిమ సిరసించు నెవ్వానినిశితబుద్ధి.

తే. యతఁడు రిపురాజరాజ్యసప్తాంగహరణ
కరణపరిణతయుక్తిప్రకాశమానుఁ
డతులితాచారవిజితగంగాత్మజుండు
మర్త్యమాత్రుండె వల్లభామాత్యవరుఁడు. 12

సీ. వాచాలసురధునీ వీచికాగంభీర వాచావిలాసుఁడు వైచమంత్రి
పల్లవోష్ఠీమానసోల్లాసకృతిపుష్పభల్లావతారుండు మల్లవిభుఁడు
పన్నగాలంకారపన్నీరజధ్యాన సన్నుతాత్ముండు పోచన్నశౌరి
ప్రత్యగ్రసహజసాహిత్యవిద్యాకళోన్నత్యుండు తిప్పనామాత్యఘనుఁడు

తే. నందనులు చంద్ర మందార కుంద కుముద
గంధకీ గంధసార సౌగంధ్యబంధు
బంధురోదారకీర్తి సౌభాగ్యనిధికి
మల్లికార్జు*ను పుత్రుఁడు వల్లభునకు. 13

మ. కనకాద్రిప్రతిమానధైర్యనిధి లింగక్ష్మాపమంత్రీంద్రుతో
ననతాహాలినృపాలమంత్రిజనతాహంకారతారాహిమా
ర్కునితో రూపరతీంద్రుతో హరిహర క్షోణీంద్రసామ్రాజ్యవ
ర్ధనుతో సాటి సమాన మీఁడు గలరా రాజన్యసైన్యాధిపుల్. 14

---

* న మంత్రికి.

గీ. తిప్పమంత్రి జగదుదీర్ణవితీర్ణుఁ డు
ద్వాహమయ్యె నధికవైభవమున
హారితగోత్రజలధిహరిణాంకుఁడగు తిప్ప
నార్యతనయఁ బెద్దమాంబ నెలమి. 15

స్ర. ఆమల్లామాత్య*పుత్త్రుండయుగనయనపూజానుసంధానసంధా
సామగ్రీపుండరీకేక్షణుఁడు వెలసె నైశ్వర్యసంపత్సమృద్ధిన్
సీమాదంతావళాభ్యుచ్ఛ్రితకరటతట క్షేత్రనిర్యన్మదాంభస్
స్తోమవ్యాలోలభృంగస్తుతవిమలతర స్ఫూర్తిసత్కీర్తిలక్ష్మిన్. 16

సీ. సత్యవ్రతాచారసత్కీర్తిగరిమలఁ జంద్రుతోడను హరిశ్చంద్రుతోడ
నభిమానవిస్ఫూర్తి నైశ్వర్యమహిమల రారాజుతోడ రైరాజుతోడ
సౌభాగ్యవైభవజ్ఞానసంపన్నత మారుతోడ సనత్కుమారుతోడ
లాలిత్యనిరుపమశ్లాఘావిభూతుల భద్రుతోడను రామభద్రుతోడ

తే. పాటియనవగు ధారుణీపాలసభల
వీరహరిహరరాయపృథ్వీకళత్ర
రత్నభండారసాధికారప్రగల్భు
మల్లికార్జునుత్రిపురారి మంత్రివరుని. 17

మ. కపటాచారవిరోధిరాజసచివగ్రావోగ్రదంభోళికిన్
నృపనీతివ్యవహారకార్యఘటనాసిద్ధారణాశాలికిన్
దపనీయాచలరాజధైర్యనిధికిం ధర్మైకపాథోధికిం
ద్రిపురారాతిమహాప్రధానునకు నే రీ యుద్దు లిద్ధారుణిన్. 18

మ. అటవీసూకర మేల యేల ఫణి యేలా కొండ లేలా దిశా
తట వేదండము లేల కూటకమఠాధ్యక్షుండు సప్తాబ్ధిసం

---

* వర్యం.

ఘటనాలంకృతమధ్యమైన నిఖిలక్ష్మాచక్రవాళంబు నె
క్కటి దాల్పం ద్రిపురారివల్లభుభుజాకాండద్వయం బుండఁగన్. 19

ఉ. గంధవతీప్రతీర పురఘస్మరపాదబిసప్రసూనపు
ష్పంధయచక్రవర్తి శ్రుతపర్వతదుర్గమహాప్రధానరా
డ్గంధగజంబు తిప్పన యఖండిత ధీనిధి కాంచెఁ బుత్రులన్
బాంధవకల్పవృక్షములఁ బైచనమల్లనతిప్పమంత్రులన్. 20

వ. అందు. 21

## కృతికర్తృప్రశంస

సీ. మూఁడు గ్రామగ్రాసములతోడఁ గూడంగ
మోపూరు పాలించె ముఱికినాట
నాశ్వలాయనశాఖయందు ఋగ్వేదంబు
కరతలామలకంబుగాఁ బఠించెఁ
బ్రత్యక్ష మొనరించి భైరవస్వామిచే
సిద్ధసారస్వత శ్రీ వరించెఁ
గామకాయనసవిశ్వామిత్రగోత్రంబు
వంశగోత్రంబుగా వార్తకెక్కె
తే. నెవ్వఁ డా త్రిపురాంతకాధీశ్వరునకు
రాయ నవరత్నభండార రక్షకునకుఁ
బ్రియతనూజుండు చండమాంబికకు సుతుఁడు
మనుజమాత్రుండె వల్లభామాత్యవరుఁడు. 22

క. అహరవధిసమయనృత్య, త్తుహినాంశుధరప్రచారఘాతాభ్రధునీ,
లహరీభ్రమఘుమఘుమమాలు, వహిఁ దిప్పయవల్లభన్న వాగ్వైభవముల్.

క. హాటకగర్భవధూటీ, పీటీకర్పూరశకలవిసృమరసౌర,
భ్యాటోపచాటుకవితా, పాటవ మరుపపని వల్లభన్నకు నమరున్. 2[illegible]

క. హాల్లీసకనటనోద్భట, వల్లవ హరికృష్ణ కంఠ వనమాల్య మిళ,
ద్గల్లత్ సురభులు తిప్పయ, వల్లభరాజప్రధానవాగ్వైభవముల్. 25

క. అమృతరసమథనసంభవ, ఘుమఘుమితపయఃపయోధికోలాహలమున్
భ్రమియించుఁ దిప్పసచివో, త్తమువల్లభవిభునిచాటుధారాఫణితుల్. 26

క. భిల్లావతారమధుభి, ద్భల్లభుజాస్ఫాల్యమానపటుచాపజ్యా,
వల్లీమతల్లిజల్లులు, వల్లభరాయప్రధానవాగ్వైభవముల్. 27

క. సెల్లారితూముకాలువ, హల్లకములకమ్మఁదావి నపలాపించున్,
సల్లలితలీలఁ దిప్పయ, వల్లభరాయప్రధానవాగ్డంబరముల్. 28

క. ఉపమించెద ధారాధర, తపనజ శైలరాజ రాజ ధారానగరా,
ధిప ధారాధరవాహులఁ, ద్రిపురాంతకవల్లభుని వితీర్ణిస్ఫూర్తిన్. 29

క. సరివత్తు రీవి నిర్జర, పతిపృథుమణి ధనద జలద బలి ఖచర నిశా,
కర సురతరు సురధేనువు, లరుదై త్రిపురారివల్లభామాత్యునకున్. 30

శా. సారాచారమునన్ వివేకసరణిన్ సౌభాగ్యభాగ్యంబులన్
ధౌరంధర్యమునం బ్రతాపగరిమన్ దానంబునన్ సజ్జనా
ధారుం దిప్పనమంత్రివల్లభునమాత్యగ్రామణిం బోల్పఁగా
వేరీ మంత్రులు సింధువేష్టితమహోర్వీచక్రవాళంబునన్. 31

సీ. మందారవారుణీమదఘూర్ణితాత్ముచే వెడఁదకన్నుల చిన్ని వడుగుచేత
డమరుఖట్వాంగదండకపాలపాణిచే ధూర్తబాలకచక్రవర్తిచేతఁ
గుక్కురపరివారకోటిసేవితునిచే వెలఁదికోఱలమోమువేల్పుచేత

... ... ... ...

తే. విశ్వవిశ్వంబు పాలించువిభునిచేతఁ
బార్వతీదేవిగారాపుఁబట్టిచేత
నీప్సితము గాంచుఁ దిప్పమంత్రీంద్రతనయుఁ
*డార్యమణి వల్లభామాత్యుఁ డహరహంబు. 32

* దర్పవణి.

## ప్రేమాభిరామప్రశంస

వ. ఆ మంత్రిశేఖరుండు రావిపాటిత్రిపురాంతక దేవుం డను కవీశ్వరుం డొనరించిన ప్రేమాభిరామనాటకంబు ననుసరించి క్రీడాభిరామం బను రూపకంబు తెనుఁగుబాస రచియించినవాఁడు. 33

గీ. అతఁ డెంతటివాఁడు ప్రేమాభిరామ,మనఁగ నెంతటియది దాని ననుసరించి
వీథి యనురూపకము మది వెఱపులేక, తిప్పవిభువల్లభుం డెట్లు తెనుఁగుఁజేసె.

వ. అని యానతిచ్చెదరేని. 35

ఉ. నన్నయభట్టతిక్కకవి నాయకు లన్న హుళక్కిభాస్కరుం
డన్నను జిమ్మపూఁడి యమరాధిపుఁ డన్నను సత్కవీశ్వరుల్
సెన్నుదుటం గరాంజలులు నింతురు జే యని రావిపాటితి
ప్పన్నయు నంతవాఁడ తగునా యిటు దోసపుమాట లాడఁగన్. 36

గీ. జననిసంస్కృతంబు సకలభాషలకును, దేశభాషలందుఁ దెనుఁగు లెస్స,
జగతిఁ దల్లికంటె సౌభాగ్యసంపద, మెచ్చుటాఁడుబిడ్డ మేలుగాదె. 37

వ. నేపథ్యమున. 38

## కథాప్రస్తావన

చ. గలిరసికుండ! షట్చరణ! గానకళాకమనీయ! యోమధు
వ్రత! వికచారవిందవనవాటిక నేమిటికిం బరిత్యజిం
చితి వటవీప్రదేశమునఁ *జెట్టులఁజేమల నేమి గల్గునన్
రతిసిటు సంచరించెదవు ప్రాఁబడిపోయెనె నీ వివేకమున్. 39

గీ. చేరవచ్చి దూరంబుగాఁ బోదు, డాయవత్తు దవ్వు పోయిపోయి
మాట లింక నేల మాపాలిటికి నీవు, మాయలేడి వైతి మంచిరాజ. 40

వ. ఆకర్ణించి సూత్రధారుఁడు హా! యే నెఱింగితి నేకశిలానగర బునం దార్యవాటంబునం గామమంజరి యను పునర్భువునందు బద్ధానురాగుండై.

* జెట్టులు నేమలు నేమి గ్లనన్ బలిచెడి.

కార్యాంతరవ్యాసంగంబునం దేశాంతరగతుండైన కాసల్నాటి గోవిందమం
చనశర్మ నుద్దేశించి యమ్ముద్దియ పుత్తెంచినయసంబంధీభూతప్రేమసంధు
క్షణాగర్భంబైన మదనలేఖాసందేశపద్ధతి యది పఠియించుచున్నవాఁ
డతనికట్టనుంగుఁ జెలికాఁడు టిట్టిభసెట్టి గావలయు నయ్యిరువురు నా
బాల్యమిత్రంబులు వీరియోగక్షేమంబు లనుసంధించెదంగాక యని
నిష్క్రాంతుఁ డయ్యె; నిది ప్రస్తావన. 41

సీ. గన్నేరుఁబూఁజాయ కరమొప్పు నీర్కావి
మడుంగుదోవతి పింజె విడిచి కట్టి
గొజ్జంగిపూనీరు గులికి మేదించిన
గంగమట్టి లలాటకమునఁ దీర్చి
వలచేత బంగారుజలపోసనముతోడఁ
బ్రన్ననిపట్టుతోరము ధరించి
జటిగొన్న వెంపట్టుజన్నిదంబు లలుంగ
యంటులు వాయంగ నటుల వైచి

తే. తళుకుచెంగావిశోకయు వలుదశిఖయుఁ
జిగురుబొమ్మంచుపెదవులు చిన్ననగవు
నందమొందంగ వచ్చె గోవిందశర్మ
మాధవునిపట్టి యొసపరిమన్మథుండు. 42

క. కాసల్నాటిశ్రేష్ఠుఁడు, మీసాలప్పయ్యగారి మేనల్లుఁడు ధా
త్రీసురతిలకుఁడు కుసుమశరాసనసముఁ డంధ్రనగరమాత్రోన్ముఖుఁడై.

వ. తూర్పుఁగనుంగొని టిట్టిభునిం జూచి, వయస్య ! సుప్రభాతంబు సుఖనిద్ర
యయ్యెనే? శీతం బుపద్రవంబు వాయదుగదా యీపుష్యమాఘంబులందు.

1 నాటను.



## చలి

ఉ. ప్రక్కలు [1]వంచివంచి ముసిపండ్లును బండ్లును [2]రాచిరాచి ఱొ
మ్మక్కలఁ [3]జేసి చేసి తల యల్లనఁ గాళుల [4]సందిసంది లోఁ
జక్కిలి [5]నొక్కినొక్కి యిరు చంబడఁ గుమ్మడిమూటఁగట్టి వీ
పెక్కి దువాళిచేసి చలి యిక్కడనక్కడఁ బెట్టు వేకువన్. 45

ఉ. కుములు హవ్యవాహములు గుప్తపుసుగ్గడితంపుఁ దోఁపు రెం
టములు దట్టుపుస్త మృగనాభియుఁ జాఁదును నోడె నద్దిరా
యమ్మకచెల్ల ! యింక నవ యౌవనపర్వనఖాంపచంబు లౌ
కొమ్మలచన్నులన్ సరకు [6]గొనటు లున్నవి వో తుషారముల్. 46

శా. స్థూలద్విత్రిపటావకుంఠనముఁ గస్తూరీరజఃపాళికా
కాలాగుర్వనులేపనంబులను నుద్ఘాటించి ధాటీగతిన్
బ్రాలేయంబు దువాళి సేసిన భయభ్రాంతంబులై యూష్మముల్
వాలాయంబుగఁ బ్రాఁకె సంధ్రవనితావక్షోజశైలాగ్రముల్. 47

శా. స్థూలద్విత్రిపటావకుంఠనములున్ ధూపోపచారంబులుం
గాలాగుర్వనులేపనంబులు వధూగాఢోపగూహంబులుం
గేళీగర్భనికేతనంబులును గల్గింగాక లేకున్న నీ
ప్రాలేయాగమ మెవ్విధంబున భరింపన్ వచ్చురా టిట్టిభా ! 48

వ. శీతోపద్రవంబు లేక సుఖనిద్ర యయ్యెనే యని యడిగి వేకువ యగు
చున్నయది గావున నిదియ మనకుఁ బ్రస్థానకాలం బని నిమిత్తం బను
సంధించి. 49



## శకునములు

ఉ. చుక్క యొకింత సిక్క బల సూపను నెక్కన రాయుచుండుటన్
జక్కఁగ వేగ విప్పుడు నిశాసమయం బిది ప్రస్ఫుటంబుగా

1. వంచు. 2. రాయు. 3. జేయు. 4. సందు. 5. నొక్కు. 6. గొన్నటు.

ఘుక్కని మాటిమాటికిని గోటఁడుపల్కెడు వామదిక్కునం
జొక్కటమై ఫలించు మనశోభనకార్యములెల్లఁ డిట్టిభా! 50

క. మ్రాఁగిలి మ్రాఁగిలి వృక్షము, పూఁగొమ్మనునుండి షడ్జము ప్రకాశింపన్
లేఁగొవమ నెమలి పల్కెడుఁ, గేఁగోయని వైశ్య మనకు గెలుపగుఁ జుమ్మీ.

గీ. *కానకానం గోడి యేట్రింత కొంకనక్క
నమిలి యీనాలుగిటిదర్శనంబు లెస్స
వీనివలతీరుఁ బలుకు నుర్వీజనులకుఁ
గొంగుబంగార మండ్రు శాకునికపరులు. 52

### కోడి పోఁత

వ. అనిన నాకర్ణించి టిట్టిభుండు. 53

ఉ. మంచన వింటివో వినవొ మన్మథుఁ డేకశిలాపురంబులోఁ
జంచలనేత్రలం బతుల శయ్యలపై రతికేళి రాత్రి వే
రించి ప్రభాతకాలము పరిస్ఫుటమైనను [1]దమ్మ డార వ
ట్టించుచునున్నవాఁ డదె కుటీగతకుక్కుటకంఠ [2]కాహళిన్. 54

వ. అని యటవోయి ముందట. 55

గీ. శీతకాలంబు కడి మాడ సేయఁ గుడుచు
భాగ్యవంతుండు జేపాడి పల్లెపట్లఁ
[3]గొత్తయోరెంబు నిగురావకూరతోడఁ
బిచ్చిలంబైన నేతితోఁ బెరుఁగుతోడ. 56

### ఒక ముచ్చట

వ. టిట్టిభ! తలంపునం బాఱె నొక్కనాఁ డేనును గామమంజరియును
బ్రేమం జెలర్పఁ గలసిమెలసి కూడిమాడి పొందిపొసఁగి యనఁగిపెనఁగి

* గానక. 1. దమ్ము; ధర్మ. 2. నాళముల్. 3. గొజ్జి.

చొక్కి తక్కియుండ దైవవశంబున గోత్రస్ఖలనంబు కారణంబుగా నకార్యాంతరప్రశ్నం బడిగిన. 57

గీ. ఎట్టకేలకు నలుక రే యెల్లఁదీర్చి
యుంపిన యధరామృతము గ్రోలుచున్న నాకుఁ
బానవిఘ్నంబుగాఁ గ్రమ్మెఁ బాపజాతి
జాతిచండాల మైన వేసడపుఁగోడి. 58

వ. టిట్టిభ! యమ్మదనపట్టాభిషేక మత్తేభరాజగమన నట్టనడుమ సురతకాలంబున వసంతసమయంబునం బాసి మల్లికాధవళాట్టహాస మహాకాళమూర్తి యగు తపర్తుసమయంబు లంఘించి లాంగలీకుసుమకేసరపరాగరేణువిసర పిశంగితదశదిశాహట్టం బగు వర్షాసమయం బెట్టకేలకుం గడపితిఁ బ్రావృట్కాలప్రవాసంబును మరణంబును రమణీరమణులకు నొక్కసమంబయ యది యెట్టి దనిన. 59

మ. పటుజంఝూపవనోత్థ ఘూర్ణాలయములో భద్రంబునం బట్టెకం
కటిపై ముచ్చుముడింగి నిర్భరవియోగగ్లాని శోషించి యొ
క్కటి నిద్రించుచు నున్న* పాంథ వసతిన్ గర్జావచః ప్రౌఢిమన్
దటిదుద్ద్యోతము చూపు నట్టనడు రేధారాధరశ్రేణికిన్. 60

వ. అని మంచన మఱియును బ్రాగ్దిశాంచలము వీక్షించి. 61

## అరుణోదయము

గీ. బాసనపుఁబువ్వుచాయతోఁ బ్రసరించు
చుండియును మెయ్యెడు నదె చూడు మొసఁగు సాజ
సొబగుపీఁచెనఁ గట్టెఱ్ఱ సోఁకినట్టి
కామమంజరిపై మోము గాంతివోలె. 62

* వాఁడ.

## సూర్యోదయము

మ. అదె మాణిక్యపుఁబూర్ణకుంభము వయస్యా! కార్యసంసిద్ధికై
మొదలం దోఁచినయట్టి మంచిశకునంబుం గా విచారింపఁగా
యుదయం బయ్యెడు భానుబింబము దిశావ్యోమావకాశంబులం
బదియార్వన్నెపసిండి తీగలఁగతిన్ [1]బ్రాఁకం బ్రభాజాలముల్. 63

శా. ఓరుంగంటిపురంబుసౌధములపై నొప్పారెడిన్ జూచితే
యీరెండల్ మణిహేమకుంభములతో [2]నేకాంతముల్ సేయుచున్
స్వారాజప్రమదాఘనస్తనభరస్థానంబులం బోసి శ్రీ
శ్రీరక్షోదము ప్రాణవల్లభదృఢాశ్లేషంబులన్ బోలె నాఁ. 64

వ. అనుచితనియమవ్రతంబుగావున నిట క్రిందటి సంధ్యాగ్నిహోత్ర క్రియా
కలాపంబులు నిర్వర్తింపంబడియె నీవు ముఖమజ్జనంబు సేసి యిష్టదేవతాభి
వందనంబు గావించితివి గదా గోధూళిలగ్నంబునం బురంబు ప్రవేశింప
వలయు విశేషించి యుషఃకాలంబు సర్వప్రయోజనారంభంబులకుం బ్రశ
స్తంబు. 65

గీ. గార్గ్యసిద్ధాంతమత ముషఃకాలకలన
శకున మూనుట యది బృహస్పతిమతంబు
వ్యాసమతము మనఃప్రసాదాతిశయము
విప్రజనవాక్య మరయంగ విష్ణుమతము. 66

వ. అని పరిక్రమించి వెలిపాళెంబు కట్టకడపటఁ గటకార కుటీరవాటికఁ
బ్రవేశించి. 67

## మేదరవాడ

సీ. ఎకసక్కెముఁ నాడు నేదైన నొకమాట
పాడు నొయ్యన పాట పాటపాట

---

1. బ్రాఁకెం. 2. హేరాళముల్.

యలఁతియద్దపుబిళ్ల యలవోక వీక్షించుఁ
గొనగోరఁ బనిచ్చి కురులు దీర్చుఁ
బయ్యెద దిగజార్చి పాలిండ్లు పచరించు
దిస్సు వాఱఁగ నవ్వుఁ దీగనవ్వ
ధవళతాళపలాశ [1]తాటంకములు త్రిప్పుఁ
గలికిచూపులఁ జూపు గర్వరేఖ

తే. కటకుటీద్వార [2]వైణవకాష్ఠ పీఠ, మధ్యభాగనిషణ్ణయై మదము మిగిలి
వీటి పామరవిటుల తంగేటిజున్ను, కాముబరిగోల మేదరకరణవేశ్య. 68

క. పుటభేదనబహిరంగణ, కటకశ్రీ కారకూటకటకం బగుని
కటకారకులవధూటీ, కుటికాగారంబు గరడి కుసుమాస్త్రునకున్. 69

క. [3]గీసిన వెదురుసలాకల, నేసిన యిరుఁదలశిఖండిసిడుమంచమునం
దోసరిలి కటకుటీరవి, లాసిని రమియించు మిండలసహస్రములన్. 70

ఉ. పల్లవతస్కరుం డొకఁడు ప్రాక్సముపార్జితతారపంక్తితో
వల్లువ మెత్తికొంచుఁ బెడ వాకిట వెళ్ళిన నాఁటనుండి పా
టిల్లనశంక నీకటకుటీరవిలాసిని యహ్హహా! పటీ
పల్లవకోణముల్ బిగియఁ బట్టి రమించును మిండగీలతోన్. 71

వ. ఆచేడియం జూచి యట పోవంబోవ ముందట. 72

## చండాలాంగన

శా. గండాభోగముపజ్జ లేనగవు శృంగారింపఁ గ్రేఁగన్నులన్
మొండై మించుమెఱుంగుఁజూపుగమి క్రొమ్మించుల్ పిసాళింపఁగాఁ
జండాలాంగన వచ్చె నొక్కతె ఋతుస్నానార్థమై యిక్షుకో
దండుం డేర్చినబాణమో యనఁగ సౌందర్యంబు నిండారఁగన్. 73

వ. అట్లు పోవం బోవ ముందట. 74

1. తాటకంబులు. 2. వేణుకా. 3 కీసిన.

## కర్ణాటి

మ. కటిభారంబును జన్నుదోయిభరముల్ గల్పించె నాబ్రహ్మ పి
న్నటి కొందీగకు మున్న యిప్డు విమలార్ణవపూర్ణమై యున్నయిం
ఘటిభారం బొకఁ డెక్కుడయ్యె ననినన్ గర్ణాటి ప్రాల్గన్నులన్
బటితాళింపుచు నవ్వె నీలకబరీభారంబు కంపింపఁగాన్. 75

వ. అనుచు గోవిందమంచనశర్మ నర్మసఖుం డగు టిట్టిభుండును గానును హట్ట
మార్గంబునం జనునప్పుడు. 76

గీ. జిగురుటుండలు నించి డాచేతియందుఁ
బెద్దయేనుఁగుదంతంబు పెట్టెఁ బెట్టి
యింతులకుఁ బ్రీతిగా మైలసంతలోన
సుసరభేత్తని ఘోషించె జోటి యొకర్తు. 77

వ. ఇది యేమి ఘోషించుచున్నయది కిరాటకుల రత్నంబ! నీవు తేటపడ
తెలింగి మాకు తెలుఁగింపు మనుచు మంచనశర్మ యడిగిన. 78

చ. ముసిముసినవ్వుతో నతని మోముగనుంగొని వైశ్యుఁ డిట్లనున్
రసికకులావతంసుఁడవు బ్రాహ్మణ! యింతకుము న్నెఱుంగవే?
యసమశరాలయంబునను హత్తినవెండ్రుకకప్పు వోవఁగా
విసరుసమీరణం బయిన వేడుకమందిది గొందు రంగనల్. 79

సీ. కమఠావతారంబుఁ గైకొన్న దైత్యారి కమనీయచరమభాగంబువోలె
నాదియుగంబునం దావిర్భవించిన జననాథుదేవుని శిరసువోలెఁ
గసటువోవఁగఁ దోమి కడిగి బోరగిలంగఁ బెట్టిన తామ్రంపుబిందెవోలెఁ
గంగమట్టియలోడ సాంగత్య మొదలిన ననుపారు మునిమిట్టనునుపువోలెఁ

తే. జిఱుతప్రాయంపునాఁటిసజ్జకపుఁజాయ
తొలుసమర్తయకాలంపువిలసనమునఁ
దరుణులకుఁ బంచబాణమందిరము లమరు
సుసరభేత్తనునీమందు సోఁకినపుడు. 80

వ. ఇది నిర్యాసమయంబును సరభేదన సమర్థంబును నగుటం జేసి సుసరభేత్తను నామంబు దీనికిం గలిగెం గ్రామనిలయాఘాట రోమాటవీ సముత్పాటన పరిపాటిన్కై పాటలగంధులు దీనిం బాటింతు రనుచు సెలవింగించి యట పోవంబోవ మునుపట వెలిపాళెంబుమధ్యప్రదేశంబున హాలికవాటియందు నొక్కచక్కని జవరాలు కట్టెఱ్ఱతోగరుంగట్లు గలయెఱ్ఱయొల్లియ నితంబభారంబున నమర్చి బాలార్కకిరణసంపర్కంబునం జాంపేయ కుసుమచ్ఛవచ్ఛాయాదాయాదంబులైన యవయవంబులు మిసమిస మెఱవం గుక్కుటాసనంబునం గూర్చుండి. 81

## పామరభామ

ఉ. కందుకకేళిసల్పెడు ప్రకారమునం బురుషాయితక్రియా
తాండవరేఖ చూపెడువిధంబునఁ బామరభామ లేఁతయా
చెంద ప్రభాతవేళ రచియించె నితంబభరంబుఁ జన్నులున్
గుండలముల్ గుదుల్కడల గోమయపిండము పెంటిమీఁగిటన్. 82

వ. అప్పామరభామారత్నంబు నుద్దేశించి. 83

గీ. పొలపములు లేవు కఱివంకబొమలయందుఁ
జిన్నినగవులు లేవు లేఁజెక్కులందుఁ
గలికితనములు లేవు క్రాల్గన్నులందుఁ
గాఁపుటిల్లాండ్ర కిట్టిభాగ్యముల యొప్పు. 84

వ. అట చని వీథీవిటంకంబునఁ డిట్టిభుండు ఓట పేటికాప్రఘాటిత కృకాటికాసికట చేటికానుయాత యగు కర్ణాటాంగనం గనుంగొని. 85

## కర్ణాటాంగన

మ. కుసుమం బెట్టినచీరకొంగు వొలయం గ్రొవ్వారుపాలిండ్లపైఁ
ద్రిసరంబుల్ పొలుపార వేణి యవటూద్దేశంబుతో రాయ న

వ్వస మెవ్వాఁడో యొకండు రాత్రి సురత ప్రౌఢిన్ దనుం దేల్చినన్
వసివాళ్ వాడుచు వచ్చుచున్నయది కర్ణాటాంగనం జూచితే. 86

గీ. వాహకుం డెక్కి విడిచినవారువంపుఁ
గొదమయుఁ బోలి రతికేళిమదము డిగ్గి
యలసభావంబుతోడఁ గర్ణాటవేశ్య
వచ్చుచున్నది యదె విప్ర వర్య కంటె. 87

ఉ. ఈమతి యింక నొక్కమతి యింకొకమా టిఁక నొక్కమాఱు నా
నోములపంటగా యనుచు * నోవ్రల బెట్టుచు రే యొకండు నా
ల్గాములు దీనితోఁ గుసుమసాయకతంత్రము సల్పెఁ బోలు లే
దా మృగశాబనేత్ర యఖిలాంగములున్ వసివాళ్ళు వాడునే ? 88

వ. అనిన మందస్మితంబుతో గోవిందమంచనశర్మ నర్మగర్భంబుగా దర్భాంకురాలంకృతంబులగు తనకరపంకజంబులం గర్ణపుటంబులు ముట్టుకొని పూతిమాషగోత్రంబును మంచననామధేయంబును జెప్పి నమస్కరించి యిట్లనియె. 89

శా. పంచారించిన నీ పయోధరము లాస్వాదింతునో; లేఁతబొ
మ్మంచున్ గెంజిగురాకుమోవి ణిసిధాత్వర్థం బనుష్ఠింతునో;
పంచాస్త్రోపనిషద్రహస్యపరమబ్రహ్మస్వరూపంబు నీ
కాంచీదామపదంబు ముట్టుదునో, యో కర్ణాటతాటంకినీ ! 90

క. వ్రాలని నీ చన్నులతో, వ్రాలెడుజక్కవలు సరియె ? వలలం బెట్టం
జాలెడు నీ కన్నులతో, బాలకి సదృశములె? వలలఁబడుమత్స్యంబుల్.

శా. చాటుప్రౌఢి బిసాళి మాడెదవు కాసల్నాటిబాఁపండవో
శాటీహాటకనిష్కముల్ వెలిగ జంఝూటంబు చాలించు క
ర్ణాటస్త్రీలుకటారికత్తియలటే రాఁపాడఁగాఁ బట్టఁగాఁ
డా టా లీడ గణింపరాదు పెఱచోటం బోలెఁ బై పాటునన్. 92

* నోడల.

గీ. దిట్టబాఁపండు నడువీథిఁ దెగడిపఱికెఁ, గూట మీక్షింపఁ దెమ్ము కిరాట నేఁడు
పన్నిదము వీని మెడనున్న జన్నిదములు, సవరగా గ్రుత్తుఁగ్రొత్తపుంజాలదండ.

వ. అనుటయు విప్రుం డిట్లనియె. 94

సీ. ముసుఁగు వెట్టిన నేమి ముత్యాలకమ్మల
క్రొమ్మించులీలలు గులుకరించె
మోము వంచిన నేమి మొలకనవ్వులకాంతి
చెక్కుటద్దములమైఁ జీరువాఱె
జూడకుండిన నేమి సొబగుఱెప్పల మించి
తేటవాల్మెఱుఁగులు దిచ్చరించెఁ
జాటుచేసిన నేమి చక్రవాకులఁ బోలు
పాలిండ్లమెఱుఁగులు బయలుపడియె

తే. సిగ్గు నటియించి మాపేద్ద చిన్నఁబుచ్చి
యేల యిటు విసాళించె దిం దేమిసిద్ధి
కామసామ్రాజ్యపట్టంబు గట్టి నన్నుఁ
గౌఁగిలింపఁగఁగదవె యోకరణకాంత. 95

వ. అని చిఱునవ్వు నవ్వుచు గోవిందమంచనశర్మ నర్మసఖుండును దానును
నటపోవఁ బోప ముందట. 96

## జూ ద ము

మ. పరివేష్టించి ప్రజాకదంబకము పైపైఁ బ్రాలి వీక్షింపఁగాఁ
బరహస్తంబున నొత్తుకాండ్రు నపలాపప్రౌఢి బోధింపఁ బా
మరులై పన్నిదమాడి యోడి మఱి దుర్ధ్యానంబుతో నాటఁగొ
ల్పిరి వేశ్యావలయాభిసంవళిత మువ్విళ్యార్చ్చ గోవిందునిన్. 97

శా. సంగాసంగజమూజయంబు పరిహాసప్రస్ఫుటాశ్లీలభా
షాంగం బాకలితాంతరావలయకక్ష్యాభాగము ద్రాలస

ద్భృంగీనిష్ఠితకాష్ఠశంకుక్రమ పాపద్యూత మీపన్నిదం
బంగీకారము సేయుఖువ్వారి మొలలం బ్రాపించుఁ గౌపీనముల్. 98

గీ, నీకు నా నీకు నా నంచు నెమకి నెమకి
ముగుద లగువారి భ్రమియించి మోసపుచ్చుఁ
బశ్యతోహరుఁ డత్యంతపాపబుద్ధి
పట్టణములోఁ దగుల్పరిష్ఠంబెగాఁడు. 99

వ. అనుచు నట ముంపట శతానందగేహినీకరరుహప్రరోహాళిఖరముఖర
వీణాక్వాణ పాణింధమంబైన మధురస్వరంబున. 100

## కరణకాంత

సీ. ఐజ్జోడు పడ నిడ్డ వెండ్రుకజంటెంబు
వలిగుబ్బపాలిండ్లకెలఁకు లారయఁ
గరమూలమున వెండిమొరవంకకడియంబు
మూఁడుమూలలలింగముద్ర లొత్త
జంగాళముగఁ బింజె సవరించికట్టిన
ఘడుఁ గొంటిపోరను లోఁదొడలు మెఱయ
బలితంపువిచ్చుటాకులదుద్దుఁగమ్మలు
నిద్దంపుఁజెక్కు_లనీడఁ జూడ
తే. నోరుఁగంటిపురంబులో నోరగ్రంతఁ, బెద్దయెలుఁగుననమ్మె సం పెంగమాన
కోకిలము పంచమశ్రుతిఁ గొసరినట్లు, కనుమయవ్వలిదేశంబు కరణకాంత.

గీ. పలికినప్పుడు తేనియ లొలికిపడెడు
జళుకుఁజూపులఁ గ్రొమ్మించు లులుకుపడెను
ములికినాటెడి కాఁబోలుఁ జెలి కిరాట
కలికి చిలుకలకొలికి యీ తెలికిజోటి. 102

## గా ను గ క న్నె

ఉ. ఈనళినాక్షి దాఁ దిరుపుటెద్దు ప్రతోదము మోపి రొప్పుచున్
గానుగపట్టెపైఁ దిరుగఁ గట్టెఁడి టిట్టిభ! మందరాద్రిమం
థానకమధ్యమానతిమిథామజలభ్రమిమండలం బధి
ష్ఠానముగా భ్రమించునల సంపదచేడియఁ బోలకుండునే. 103

ఉ. మీనవిలోచనంబులును మీఁటిన ఖం గనుగుబ్బచన్నులిం
పైనవచోమృతంబు సొగసైనమదాలసమందయానముం
గా నొనరించి దీని గణికామణిఁజేయక నిర్దయాత్ముఁడై
గానుగదానిఁ జేసిన వికారవిధిం దలమొత్తఁగాఁదగున్. 104

వ. అట యుత్తరంబునం గత్తెరనొత్తి పెక్కువన్నెల పొత్తుల బహువిధ
వర్తనల హత్తించి యెత్తి కట్టిన పూగోత్తులు మత్తకోకిల కలహంస దా
త్యూహ వ్యూహంబులుం గలిగిన మోహారివాడయందు. 105

## కు ట్ర పు వాఁ డు

చ. కొలుచును జేనవెట్టి కుచకుంభయుగం బెగడిగ్గఁ గన్నుగ్రే
వలఁ బరికించుఁ గక్షముల వైచును దృష్టులు మాటిమాటికిం
గలికితనంబునం దఱచుగా నగు సౌచికపల్లవుండు గం
చెల వెసఁ గుట్టియీఁడు వెల చేడియకున్ విషయాభిలాషియై. 106

వ. అనుచు నవ్వాడ గడచి యట యుత్తరంబు ననునప్పుడు ముందట నొక
యింటిమఱుంగున మచ్చెకంటిం బొడగని. 107

## ఈ రి ర్చ్పు ట

ఉ. సారెకు సారె కేమిటికిఁ జంపెదు గోరఁటయెఱ్ఱలైన వా
లారు నఖాంకురంబుల పయస్యకచంబునఁ బొటపొట యీ
రీరిచి సీత్కృతుల్ చెవుల కింపొనరింపఁ జకోరనేత్ర! నీ
చారుకుచద్వయంబు మముఁ జంపెడుదోసము నీకుఁ జాలదే? 108

వ. అనుచు నయ్యింటిముందట. 109

## పసుపునూలుట

మహాస్ర. పరిపాటీఖర్వఖర్జూపరతిసమయసంభ్రాంతసంభోగభంగిన్
దరుణీరత్నంబు హేలాతరళగతి హరిద్రారజఃకర్దమంబుం
గురు లల్లాడంగ వీఁగుంగుచములు గదలం గొంతుగూర్చుండి నూరెన్
గరవల్లీకాచభూషాకలమధురఝణాత్కారముల్ తోరముల్ గాన్. 110

వ. అని యచ్చోటు వాసి బాహ్యకటకవీథీవిటంకంబు లతిక్రమించి. 111

## ఓరుగల్లు

సీ. సప్తపాతాళవిష్టపమహాప్రస్థాన ఘంటాపథంబైవ గనుపరిఖ
తారకామండలస్తబకావతంసమై కనుచూపు గొనని ప్రాకారరేఖ
పుంజీభవించినభువనగోళముభంగి సంకులాంగణమైన వంకదార
మెఱుఁగుటెక్కలతోడి మేరుశైలముఁబోలు పెనుబైఁడితలుపులపెద్దగవని
తే. చూచెఁ; జేరెఁ; బ్రవేశించెఁ; జొచ్చెఁ; బ్రీతి
సఖుఁడు దానును రథఘోటకకటకరటి
యూథసంబాధముల కొయ్య నోసరిలుచు
మందగతి నోరుఁగల్లు గోవిందశర్మ. 112

వ. ప్రవేశించి టిట్టిభనామధేయుండైన కోమటిసెట్టిగారితో నాతఁ
డి ట్లనియె. 113

సీ. రాజమార్గంబు వారణఘటాఘోటకశకటీకాభటకోటిసంకులంబు
ధరణీస్థలీరజస్త్రసరేణుబహుళంబు గావున మన మందుఁ బోవవలదు
క్రంతత్రోవలనొండుగలకలంబులు లేవు తఱచుగా సుఖవినోదములుగలవు
మఱియు విశేషించి మన్మథకూటమా వేశవాటిక మధ్యవీథిఁ దఱిసి
తే. చిత్తమున కెక్కినట్టి లంజియలతోడ
సరససల్లాపసౌఖ్యంబు సలుపవచ్చు

నంత మధ్యాహ్నసమయమా నపుడుగాని
వేడుకై యుండ దక్కలవాడ సొరఁగ. 114

గీ. అనినఁ డిట్టిభుఁ డౌనంచు ననుచరింప, నాలుమరి క్రిందిత్రోవగా నరిగి యరిగి
విప్రుఁ డీక్షించెఁ బలినాటివీరపురుష, పరమదైవతశివలింగభవనవాటి. 115

## పల్నాటివీరులకథ

మ. ద్రుతతాళంబున వీరగుంభితకధుంధుంధుంకిటాత్కారసం
గతి వాయింపుచు సాంతరాళికయతి గ్రామాభిరామంబుగా
యతిగూడం ద్విపదప్రబంధమున వీరానీకము బాడె నో
కృత ప్రత్యక్షరముం గుమారకులు ఫీట్కారంబుసం దూలఁగన్. 116

సీ. గర్జించి యరసి జంఘాకాండయుగళంబు
వీరసం బెటకోల వ్రేయు నొకఁడు
ఆలీఢపాదవిన్యాస మొప్పఁగ వ్రాలి
కుంతాభినయముఁ గైకొను నొకండు
బిగువుఁ గన్నుల నుబ్బు బెదరుఁజూపులతోడ
ఫీట్కారమొనరించుఁ బెలుచ నొకఁడు
పటుభుజావష్టంభపరిపాటి ఘటిలియిల్ల
ధరణి యాస్ఫోటించి దాఁటు నొకఁడు

తే. ఉద్ది ప్రకటింప నొక్కరుం డోలవాఁడు
బయలు గుణ్ణంబు *భంజళ్లఁ బఱపు నొకఁడు
కోడుమా దాటింపుచును బెద్దగొలువులోనఁ
బడఁతి పల్నాటివీరులఁ బాడునపుడు. 117

గీ. కులము దైవతంబు గురిజాలగంగాంబ, కలనిపోతులయ్య చెలిమికాఁడు
పిఱికికండలేని యఱువదియేగురు, పల్లెనాటివీరబాంధవులకు. 118

---

* భంజెల్ల.

గీ. ఆరువెల్లి *నాయురాలి దుర్మంత్రంబు, కోడిపోరు చాపకూటికుడుపు
ప్రగమకారణములు పల్నాటిమేకాంగ, వీరపురుషసంప్రహారమునకు.

ఉ. పచ్చనిపిండిగందమును బాలము సేసయు నెఱ్ఱపూవులన్
గ్రుచ్చినకంఠమాల్యములు గొప్పగనల్లిన వేణిబంధముల్
కుచ్చులవీరసంబెటయుఁ గ్రొత్తమణుంగుగు కాసెపుట్టముల్
అచ్చలకెక్కినట్టి రవణంబులు వీరకుమారకోటికిన్. 120

క. నల్లగొండయు నాగరి, కల్లును ధరణీస్థలిం బ్రగల్భస్థలముల్
పల్లెలు నాగులేటును, బల్లెత్తు కాంత యెల్లప్రారంభంబుల్. 121

సీ. ఇచ్చోట భుజియించి రేకకార్యస్థులై సామంతనృపతులు చాపకూడు
ఇచ్చోటఁ జింతించె నిచ్చ నుపాయంబు నళినాక్షి యారువెల్లి నాయురాలు
నిజ మనుశుద్ధికై నిప్పులమొటిలో నోలాడె నిచ్చోట బీలసాని
ఇచ్చోటఁ బోరిరి యిలపణంబుగ గొల్ల సవతితల్లులబిడ్డ లవనిపతులు
తే. ధీరులగువార లేవురు వీరపురుషులై మదోద్ధతి నిచ్చోట నాజిఁ బడిరి
యనుచుఁ జెప్పుదు రైతిహ్య మచటనచట జనపపెద్దలు పల్లెదేశములయందు.

ఉ. చిత్తముగూర్చి మాచెరల చెన్నుఁడు శ్రీగిరిలింగముం గృపా
యత్తతఁ జూడఁ **బల్లెవిషయంబున కామహిమంబు చెల్లఁగా
కుత్తరలోన మింట జల ముట్టినమాత్రన నాపటాలలో
విత్తినయావనాళ మభివృద్ధి ఫలించుటయెట్లు చెప్పుమా ? 123

మ. మగసింగంబులు సంగరాంగణములన్ మత్తిల్లి రున్మత్తులై
జగదేకస్తుతు లంచు నేమిటికి సంశ్లాఘింప! నాభూమిలోఁ
జిగురుంబోఁడులుఁ గాఁపుగుబ్బెతల నక్షీణప్రభావంబునన్
మగసింగంబులఁగా నెఱుంగుదురు పుంభావప్రసంగంబులన్. 124

గీ. కోలదాపునఁ ద్రిక్కటిఁ గూడియున్న, గచ్చుచేసినచిత్రంపుగద్దెపలక
వ్రాసినా రదె చూడరా వైశ్యరాజ, శిల బ్రహ్మాదివీరనాసీరచరిత! 125

---

*నాయినారి. ** ముల్కి.

వ. ఈ వీరపురుషులు మనకుం గార్యసిద్ధి సేయుదురు గాక పదపద మనుచుం గతిపయపదంబు లరిగి నింబపల్లవ నికురుంబ సందానిత నందనమాలికాలంకృత ద్వారం బగు నేకవీరాగార గోష్ఠంబు గనుంగొని. 126

## ఏకవీర

సీ. వందనం బిందిరావరు కన్నతల్లికి దండంబు ఫణిరాజమండనకును
నంజలి సోమసూర్యానలనేత్రకు నభివందనము జగదంబికకును
మొగుపుఁజేతులు దేవమునిసిద్ధసేవ్యకు జమదగ్ని గారాపుసతికి శరణు
జోహారు రమణీయశోభనాకారకు నమితంబు గిరిరాజనందనకును
తే. నిత్యకల్యాణి కలికులనీలవేణి, కాదిశక్తికి వేదవేదాంతసార
కేకవీరకుఁ బూర్ణరాకేందుముఖికి, నఖిలజననికి సాష్టాంగ నుతుదినంబు.
సీ. పద్మలోచన భృగుబ్రహ్మాన్వయమివంశ
పరిపాటి కభినవాభరణ మయ్యె
రమణి త్రేతాద్వాపరములసంధ్యావేళ
మగనితోఁ బెక్కేండ్లు మనువు మనియె
నెలఁత కానకకన్న నెయ్యంపుఁగొడుకుచేఁ
జంపించె ముయ్యేడుసారె నృపుల
తరుణి హైహయరాజదంతాస్థిపటలంబు
గవడపేరుగఁ జేసి కట్టెనట
తే. మండపాకను బెనుఁబాక మాహురమునఁ, నాగపరమున బోలాస ననిచెనింతి
యోరుఁగంట వసించె నీలోత్పలాక్షి, కాకతమ్మకు సైదోడ యేకవీర.
సీ. అలిగి యెంతటిరాజునాంధ్రడైనను బట్టి పుట్టుఁబాపలఁ జేయురట్టుకత్తె
ఘనుఁడైన జమదగ్నిమునినాథుకూరిమి వెలయించుపెనుఁబాకవేడ్కకత్తె
సుక్షత్రియకులంబు నిక్షత్రముగఁజేయు కొడుకుఁ గాంచినయట్టి కోపకత్తె
బవనీలజవనికపాటల నిల్లాంధ్ర రమణఁ ద్రుళ్లాడించు రంతుకత్తె

తే. మోలిమి గదుళ్ళవాఁగులో నోలలాడు, కలికిపల్లికదే బెలఁ గన్నుతన్ని
వాసికెక్కినయట్టిపోలాసయిల్లు, చక్క మెప్పులమాహుర మ్మక్కనాచి.

బవనీఁడు

సీ. కమనిక్షిప్తవికస్వరస్వరవిలాసశ్రీనివాసంబు జవని కందుఁ
గట్టినతంత్రికిఁ గంఠశ్రుతికిఁ గూడఁ జొక్కంబుగా నారి సొబగు మీఱ
నాలాపములశుద్ధసాళవ సంకీర్ణ వివిధరాగంబులచవులుచూసి
డమడమధ్వనులఁ బొటారించి యెడనెడఁ గత్తెరమార్గంబు బిత్తరిల్ల
తే. వాద్యవైఖరిఁ గడుసెఱవాది యనఁగ నేక వీరామహాదేవియెదుట నిల్చి
పరశురామునికథ లెల్లఁ బ్రౌఢిఁ బాడెఁ జారుతరకీర్తి బవనీలచక్రవర్తి.

మాలెత

మ. అలరుంబోఁడి జనంగమప్రమద మధ్యానద్ధఘంటాధ్వనుల్
చెలఁగంబాడె సమస్తలోకజననిన్ శ్రీయేకవీరాంబికన్
వలరా జొక్కకమూర్ఛనాస్వరమునన్ బ్రాణంబు గల్పింపఁగాఁ
గలకంఠీకలకంఠకోమలకుహూకారంబు తోరంబుగన్. 131
మ. అకలంకస్థితిఁ గోరి కొల్చెదరు బ్రహ్మానందభావంబునన్
సకలానందమయైకమాత లగుచున్ సంతోషచిత్తంబునన్
*తకదుందుమ్ములు తాళముల్ జవనికల్ తంధాన లమ్మయ్యకున్
ఏకవీరమకు మాహురమ్మకునథోహ్రీంకారమధ్యాత్మకున్. 132
శా. ఆలోకింపక మ్రొక్కరాదు నిజభక్త్యావేశసంపత్తిమై
నాలోకించినఁ జిత్త మెట్లగునో కామావేశసంయుక్తిమై
నేలా? గోయి కిరాట? మానుదమె సంవీక్షింతమో చెప్పుమా
ప్రీశాశాన్యకటీరమండలముదేవీ శంభళీవ్రాతమున్? 133

---

*తకదుమ్ముల్ థైకతాళముల్.

## కాఁపుటాలు

సీ. జటివానిగడితంపుఁ జెఱుతచౌకంబుల తోఁగరుఁబుట్టము కచ్చఁదోడిని కట్టి
యోలగందపుబొట్టు నుపరిభాగంబుపై సిందూరతిలకంబుఁ బొందుపఱచి
పసరుదాఁకెడునింబపల్లవంబులదండ గుబ్బచన్నులమీఁదఁ గుదురుకొల్పి
క్రొత్తదోమినవంతకోరకంబులయందుఁ దాంబూలరాగంబుతళుకుఁగూర్చి
తే. సకలసంధ్యంగములకుఁ జేజంబు గలుగ
మధుమదారంభ మణఁకువ మరలఁ ద్రోవఁ
దేఁకువయు నారజంబునుఁ దేటపడఁగఁ
బురమునకు వచ్చె నొకకాఁపుఁబూవుఁబోఁడి. 134
వ. అయ్యవసరంబున నేకవీరాంబకుం బ్రణమిల్లి యట చనునప్పుడు. 135

## జక్కులపురంధ్రి

సీ. కోణాగ్రసంఘర్షఘుమఘుమధ్వని తారకంఠస్వరంబుతో గారవింప
మసిబొట్టుబోనాన నసలుకొల్పినకన్ను కొడుపుచేఁ దాటించు నెడపదడప
శ్రుతికి నుత్కర్షంబుఁ జూపంగవలయుచోఁ జెవిత్రాడు బిగియించుజీవగఱ్ఱ
గిలుక్కుగిలుక్కున మ్రోయు కింకిణీగుచ్ఛంబు తాళమానంబుతో మేళవింప
తే. రాగమునుండి లంఘించు రాగమునకు
నురుమ యూరుద్వయంబుపై నొత్తిగిల్లి
కామవల్లీమహాలక్ష్మి కైటభారి
వలపు వాడుచు వచ్చె జక్కులపురంధ్రి. 136

## అక్కలు

సీ. ముద్రికామాణిక్యములదీప్తి కెంగేలి పింఛెంబుఁగుంచెతో బిత్తరింప
నుపవాసమునఁ దద్దయును సన్ననగు కౌను చనుదోయిభరమున జలదరింపఁ
దోఁకచుక్కలఁబోలు తోరంపుఁదెలికన్ను లావైళమున సిగ్గు నతకరింపఁ
నిద్దంపువెలిపట్టునెఱికె ధూళినయప్పు తొడలమించులు వెలిఁ దొంగలింప

తే. సురమచప్పళ్లకును బిల్లదురుల మ్రోఁత
కంతకంతకుఁ జేరుబ్బ నావహింప
నాడెఁ బీఁటలపై నోలిఁ గూడియున్న
యక్కలేడ్వురలో నొక్కయలరుబోఁడి. 137

చ. హరహర యింత యొప్పెనె మహారభటీక జగఝ్ఝంకృతస్వన
స్మరళివిమిశ్రితాంకరవ మూర్ఛలఁ జిత్తము లుబ్బ యక్కలే
డ్వురు నటె యాడఁ జొచ్చిరి కడుం గడు వేడ్క సమున్నమత్పయో
ధరయుగభారభీరుతమ తన్వవలగ్నము లైన నృత్యముల్. 138

వ. ఇదె యీయింటి యజమానుఁడు సంతానకాంక్షియై ప్రతిబంధ నోష
నార్థంబు యక్షకన్యలం బరితోషారాధనంబు సేయుచున్న వాఁడు గావలయు.
మాణిభద్రకులోద్భవులైన దేవతలు కామవల్లి శ్రీమహాలక్ష్మితోఁగూడి
యపేక్షితకార్యంబు మనకు నవ్యాక్షేపంబునం జేయుదురుగాక యనుచు
విశ్వాసంబుతో నమస్కారంబు సేసి కాసల్పాటి గోవిందమంచనశర్మ
నర్మసఖుండు దాను నట చని ముందట. 139

గీ. మంద్రమధ్యతార మానత్రయాభిన్న
మహిషశృంగనాద లహరిఁ గూడి
డమరు డిండిమంబు ఢమఢమధ్వని మ్రోసె
నద్భుతం బదేమి యార్భటంబు. 140

— మైలారభటులు —

అని టిట్టిభుం డడిగిన. 141

సీ. అవటవ ముందు నెట్టనిచంద్రమక్లాల చోద్యంపు గుండాలు చొచ్చువారు
కరవాఁడియలుఁగుల గనపపాఁతర్లలో నుట్టిచేదులు గోసి యుఱుకువారు
గాలంపుఁగొంకిఁ గంకాళచర్మము గ్రుచ్చి యుదుపీథి నుయ్యేల లూఁగువారు
కటికిమహాన్నాళంబు గండగత్తెరవట్టి మిసిమింతులును గాళ మ్రింగువారు

## నగరావలోకనము

సీ. అదె భైరవస్థాన మటమీఁద నల్లదె చాముండేశ్వరీమహాశక్తినగరు
వీరభద్రేశ్వరాగారమంటప మదె యదె బౌద్ధదేవువిహారభూమి
అదె ముద్దరాలుసానమ్మనివాసంబు నల్లదె కొమరసామయ్య నగరు
అదె పాండవులగుడి యటదక్షిణంబునఁ గర్తారుఁ డుండు తురకలమసీదు
తే. కొంతవవ్వల నదె మహాగోపురములు, పైఁడికుండలు రవిదీప్తిఁ బ్రజ్వలించి
కానవచ్చెను మేరుశృంగములఁబోలెఁ, గేశవశ్రీస్వయంభూనికేతనములు.

వ. అనుచు నట చని ముందట నొక్క భైరవాలయంబుఁ బొడగని నమస్క
రించి కౌసల్నాటి మంచనశర్మ యిట్లనియె. 150

## భైరవస్తుతి

మ. అమితోత్సాహముతోడ నీవు పటుసాహసోత్కర్షకక్క మం
టు మహాకంపము నొందఁ జేయఁ దొలఁకెన్ నీడుల్ పయోధి వేలాలుఠ
త్క్రమఠంబై చలమానమీనమయి యుద్యన్నక్రమై యుత్తర
త్తిమిరమై యుల్లలదంబుమగ్నధునియై ధీరా మహాభైరవా! 151

వ. అని యూర్ధ్వం బవలోకించి యిప్పుడు మధ్యాహ్నకాలం బగుచున్నయది.

## మధ్యాహ్నము

శా. ప్రాలెన్ దిక్కులు భానుభావ్యతికర ప్రక్రీడదర్కోపల
జ్వాలాజాల జటాలజాంగలతటీ వాచాలకాయష్టులై
రోలంబంబులు మూఁతిముట్ట వెలిచెన్ గ్రొవ్వేఁడి బీరెండలన్
జాలం గ్రాఁగి కరంబు వేఁడి యగుకాసారాబ్జపైరేయముల్. 153

వ. అని యనంతరం బాకాశంబునం జెవిపెట్టి శ్రుతివభినయించి గోవిందుండు.

## గడియారము

మ. ఉడువీథిన్ శిఖరావలంబియగు నఙ్గ్రోశిర్వేశుమోసాలపై
గడియారంబున మ్రోసె రెండెనిముదుల్ ఘంటాఘణాత్కారముల్

సడలెఁ భానుఁడు పశ్చిమంబునకు వైశ్యా! పూటకూటింటికిఁ
గుడువంబోదమె లెక్క యిచ్చి? కడు నాఁకొన్నార మిప్పట్టునన్.

వ. విచారించిన నదియును మనకు విశ్రమస్థానంబు. 157

## పూఁటకూటియిల్లు

గీ. సంధివిగ్రహయానాదిసంఘటనల, బంధకీజారులకు రాయబారి యగుచు
పట్టణంబున నిత్యంబు పగలు రేయి, పూఁటకూటింట వర్తించుఁ బుష్పశరుఁడు.

వ. అనుచుఁ గొంత దవ్వరిగినం దమకు నెదురుగా నేతెంచు నొక్క
బ్రాహ్మణుం గనుంగొని. 158

ఉ. వీఁడిదె తెల్లనాకులను వీడెము సేయుచు వీధి వచ్చుచు
న్నాఁడు మదించి తిండి తినినాఁడు సుమీ యిటమీఁద నేడకో
తేఁడఁగఁబోయెడిం గరణ దేశపుజాణఁడుగాఁగఁబోలు నీ
బాఁడు పణోపహారపరిపాటి యెఱుంగఁగవచ్చు వీనిచేన్. 159

వ. ఇతఁడు వెడలివచ్చు నవ్వాడయె పూఁటవంటకంబు వెట్టు బాడబులవాడ
గావలయు నది యెట్లంటేని. 160

ఉ. ఘ్రాణపుటీకుటీరములఁ గాఁపుర ముండఁదొడంగె నిప్డు పా
షాణఘురట్టఘట్టనవశంబునఁ బుట్టిన సత్తుగంధ మ
క్షీణకఠోరసౌరభవిజృంభణదిక్కులఁ జల్లఁజొచ్చె సా
మ్రాణిపదార్థజాలములు బ్రాహ్మణకాంతలు తాలఁ బోయఁగన్. 161

గీ. మందవేగంబుతోఁ గ్రొత్తమలఁకవాళ్ల
కిఱ్ఱుచెప్పులు మొరయ నుంకించి నడుచు
కరణ బ్రాహ్మణవిటముఖ్యుఁ గదియవచ్చి
పూతిమాషాన్వయుండగు భూసురుండు. 162

వ. పూఁటవంటకరంబుల వృత్తాంతం బడిగిన నతండు: 163

క. ఆహారవిహారములకో, యాహారంబునకునో విహారంబునకో
ఏహారము మీకీసం, దేహారంభంబు మాకుఁ దెలియఁగ వలయున్. 164

వ. ఆహారంబున కంటేని. 165

ఉ. కప్పురభోగివంటకము కమ్మనిగోధుమపిండివంటయుం
గుప్పెఁడుపంచదారయును గ్రొత్తగఁ గాఁచిన యాలనే పెస
ర్పప్పును గొమ్మునల్లనఁటిపండ్లును నాలుగు నైదు నంజులుం
లప్పలతోడఁ గ్రాఁ పెరుగు లక్ష్మణపజ్ఝ లయింట రూకకున్. 166

వ. విహారంబున కంటేని దద్గృహంబున. 167

క. అఱుగౌను గుబ్బచన్నులు, మెఱుఁగుంగన్నులును గలుగు మెచ్చుల నవలా
కుఱుబోడ ముండరత్నము, [1]బఱివోవఁగ విడిచినట్టి బ్రహ్మకు జేజే. 168

శా. పూవుంబోఁడులు లేరె విప్రవిధవల్ భూమండలిం జానిరే
ఖ్యావైదగ్ధ్యవిలాసవిభ్రమకళా గర్వంబు లట్లుండనీ
యావిశ్వస్తయుపస్థచాయ నవలత్పాధీశఫాలస్థలీ
సౌవర్ణస్థిరపట్టబంధసుషమాసౌభాగ్యలక్ష్మిం [2]నగున్. 169

ఉ. కోయిల పంచమస్వరము క్రోల్చినభంగిని [3]గంఠమెత్తి రా
మాయణ మాఱుకాండములు నచ్యుతజాగరవేళఁ బాడె నా
రాయవితంతురత్న మనురాగముతోడ "నమశ్శివాయ శాం
తాయ సమస్తదోషహరణాయ" సమానమె దాని కెవ్వరున్ ? 170

ఉ. సంకృతిపూతిమాషకుల సాగరశారదపూర్ణిమాకురం
గాంకుఁడు మంచి లక్ష్మణగృహంబున నెచ్చెలికాఁడుఁ దానును
జంకలబంటిగా మెసవి చక్కనివేడుకకత్తెఁ జూచి తా
రింకొకమారు వత్త మని యేఁగిరి కార్యభరంబు పెంపునన్. 171

వ. అట పోవంబోవ ముందట. 172

---

1. బఱిపోతుగఁజేసి. 2. గనుం. 3. ఎద్దకంచి, ఎద్దికూచి.

## కేదఁగి పూవు

సీ. పాంథసీమంతినీ ప్రాణమత్స్యములకు
గాలాములగు కంటకములతోడ
గరుడపచ్చలచాయఁ బరిహసింపఁగఁజాలు
దళమైన బాహ్యపత్త్రములతోడ
జీర్ణకీకసకణశ్రేణిఁ బిడ్డఁజేసి
యడియఁ దోమినయట్టియన్నులతోడఁ
బదియాఱువన్నియ బంగారు సరివచ్చు
సంవర్తికాపలాశములతోడ
తే. శివునిచిచ్చుఱకంట వెచ్చిన యనంగుబూది కెనయైనకమ్మఁబుప్పొళ్ల తోడఁ
దావి ఘనమైన కమ్మగేదంగిపూవు భూసురునకిచ్చెఁ దగ నొక్కపుష్పలావి.
వ. ఇచ్చినం జూచి. 174

ఉ. క్రొన్నెలరేఖతోడఁ గెడఁగూడి సుఖింపఁగ భాగ్య మబ్బమిన్
ఖిన్నతనొందుఁ గాని నవకేతకి శూలి వివేకహీనుఁడై
తన్నుఁ దిరస్కరించుటకు దైన్యమునొంద దదే వివేకసం
పన్నిధి దానిపాలి పెరుమాళ్లొకఁ డెక్కడనైన లేఁడొకో? 175

గీ. అందుకొని పుష్పలావికిఁ ద్యాగమిచ్చి
బ్రాహ్మణుల కందు నొక్కొక్కపత్త్ర మొసఁగి
జాణవిప్రుండు సిగఁదాల్చెఁ జందమామ
కొండదాలికయగు నొక్కగోమలిఱేకు. 176

* ... ... ... ...

వ. అదె విద్వేషిభువన జిగీషాసంరంభ విజృంభమాణ ఝషధ్వజ భుజపరాక్రమ సముత్సాహ నాటక ప్రస్తావనా ప్రథమనాందీశ్లోకం బగు వేశవాటికానికటంబు. 177

---

* ఇట గ్రంథపాత మేమో?

గీ. చందనంబున గలయంపి చల్లినారు, ముగ్గులిడినారు కాశ్మీరమున ముదమున
వ్రాసినా రిందురజమున రంగవల్లి, కంజములఁ దోరణంబులు గట్టినారు.

వ. ఇది యెవ్వరియిల్లొకో! శోభనంబు ముడివడుచున్న యది యనుచు
నాకాశంబు వీక్షించి యచ్చటి వారల నేమి యని యడిగిన. 179

## మాచల్దేవి

శా. ద్వీపాంతంబుననుండివచ్చితివె? భూదేవా! "ప్రశాంతం మహా
పాపం" సర్వజగత్ప్రసిద్ధసుమనోబాణాసనామ్నాయవి
ద్యోపాధ్యాయి ప్రతాపరుద్రధరణీశోపాస్తగోష్ఠీప్రతి
ష్ఠాపారీణ నెఱుంగవయ్యెదవె మాచల్దేవివారాంగనన్. 180

వ. చిత్రశాలాప్రవేశంబు చేయుచున్న యది పుణ్యాహవాచనకాలంబు
మీరునుఁ బచ్చని [1]పెండ్లికూటంబుఁ జూడవచ్చునది యనిన. 181

గీ. లెస్సగాక కిరాట, యాలేమచరిత
మాడుదురు నాటకంబుగ నవనిలోన
దీనిఁ జూడంగఁ బోదమా యీనెపమున
నరసి చూతము మన కేమి యచట ననుచు. 182

వ. అనుచుఁ బ్రవేశనాటితకంబునఁ జిత్రశాలఁ జొచ్చి పూతిమాషగోత్రుం
డచ్చోటం [2]బెండ్లికూటంబున నిలువునం బైసేసి హంసతూలికాతల్పంబు
మీఁదం గూర్చున్న హావభావ విభ్రమవిలాసనిధి మాచల్దేవిఁ గనుఁగొని.

గీ. అంకుశాఘాతరేఖల నంద మొందు, గంధగజకుంభములతోడఁ గలహమాడు
క్రొత్తనఖములతోడి నీకుచభరమున, కలిప యభ్యుదయపరంపరాభివృద్ధి.

గీ. కల్లఁజెప్పము విను నీకుఁ గల్పప్రసిద్ధి, ఢిల్లిసురతాణికిని లేదు పల్లవోష్ఠి
యాదిలక్ష్మికి నీకును భేదమేమి, యుదధి జనియింపకుంటె యొకటె దక్క.

1. పిల్లి. 2. బిల్లి.

గీ. ఓరుఁగంటిమాచాంబ పయోరుహాక్షి
పంచబాణావతారుని మంచిఁ జూచి
కంకణాలంక్రియాఘుణాత్కార మెసఁగ
"నయ్యగారికి జోహారు" లనుచు మ్రొక్కె. 186

గీ. అగురుధూపాధివాసితాభ్యంతరంబు, మగువ నీమన్మథచ్ఛత్రమంటపంబు
సర్వయోషిదసామాన్యసౌష్ఠవంబు, కాచుఁగావుత మోర్గంటికటకవిటుల.

వ. అనుటయుం. 188

సీ. ఎందుండి వచ్చితి రీరు? కాసల్నాట నుండి వచ్చితిమి మే ముత్పలాక్షి
యెవ్వరివారు మీ ? రేము సంకృతి పూతిమాష మాధవునికుమారవరుఁడ
మీదివ్యనామకం బేదియో ? గోవింద మంచనశర్మసమాహ్వయులము
మీర లిచ్చటికి రాఁ గారణం బెయ్యది ? చేరి మీబోంట్ల నాశీర్వదింప
తే. నైన విచ్చేసి కూర్చుండ నవధరింపు
వాఁచ వచ్చెద మటువోయి వనరుహాక్షి
యెచ్చటికి వార్వ బోయెద రెఱుఁగఁజెప్పఁ ?
డక్కవాడకు మేము బ్రాహ్మణుల మగుట.' 189

వ. చిత్రావలోకనంబు చేసి టిట్టిభునకు గోవింద మంచనశర్మ యి ట్లనియె.

## చిత్రశాల

సీ. అదె దారువనభూమి, యసమనేత్రుఁడు వాఁడె
సంయమీంద్రులపుణ్య సతులువారె
యదె కన్యకారత్న, మబ్జాసనుఁడు వాఁడె
యదె రతిక్రీడా విహారశయ్య
వాఁడె వైకుంఠుండు, వారె గోపస్త్రీలు
యమునానదీసైకతాంత మదియె
అదె యహల్యాదేవి, యమరాధిపుఁడు వాఁడె
యదె పర్ణశాలికాభ్యంతరంబు

తే. చందురుఁడు వాఁడె, యదె బృహస్పతిపురంధ్రి
జాలరియు నదె, శ్రీపరాశరుఁడు వాఁడె
కుశికజుఁడు వాఁడె, యదె యింద్రుకొలువులేమ
చిత్తజునిశౌర్య మెఱిఁగించెఁ జిత్రశాల. 191

ఉ. తియ్యనివింటిజోదు రతిదేవిచనుఁగవ నొత్తిగిల్లి యొ
య్యొయ్యన వంకచక్కఁబడ నొత్తెడుఁ జూచితె పుష్పబాణముల్
మయ్యెరవ్రాసెఁ జిత్తరువు మాఁగిలిమాఁగిలి, చిత్రకారుఁడా!
దయ్యముగాక; *యీవిపస దానము టిట్టిభ; వీని కీఁదగున్. 192

వ. అనుచుఁ దద్గృహంబు నిర్గమించి పూర్వానుభూత యగు గాంధర్విగృహంబు రోయువాఁడు కతిపయమందిరంబులకు నవల సిందువారలతికాకుడుంగం బడియాలంబున నెఱిఁగి యనుంగు మొగసాలం జొచ్చిన దాసదాసీజనంబు ససంభ్రమంబుగా నెదురేఁగి తోడ్కొనిపోవం బోయి యభ్యంతరమందిరంబున మహోత్సవవ్యాపార పారీణయైయున్న యవ్వారముఖ్యం జేరి యాసనార్ఘ్యపాద్యాది సముచితసత్కారంబులం బొంది సుఖాసీనుం డై. 193

ఉ. గోత్రమువార లెల్లఁ గెడ గూడినవారు వ్రతంబొ; దేవతా
యాత్రయొ; పండువో; మనగృహంబున శోభన మేమి? శోభనం
బత్రిసమాన! నేటియపరాహ్ణసమాగమవేళఁ బుష్యన
క్షత్రమునందు నీయనుఁగు గాదిలికూఁతురు చూచు సద్దమున్. 194

క. ఆవేళ నీవు బిడ్డకు, దీవనమంత్రంబు చెప్ప దీర్ఘాయు వగున్
లావణ్యంబు వివేకము, ప్రావీణ్యము వైభవంబు భాగ్యము గలుగున్.

సీ. ముకురవీక్షావిధానంబు మొదల లేక, వెలపడంతికిఁ గారాదు విటునిఁ గవయ
యాయజాకున కెట్లు చేయంగవచ్చు నరణిసంగ్రహ మొనరింప కధ్వరంబు.

* వీని; నీవి.

గీ. లంజెహారికి శ్రీమహాలక్ష్మిగాదె, దర్పణము విప్రముఖ్య గంధర్వగణము
పుణ్యచారిత్ర దృష్టాంతభూమిగాదె, దర్పణమ్ము వివర్తవాదములకెల్ల. 197

ఉ. ఉన్మదమత్తకోకిలకుహూకలపంచమరాగరాగసం
పన్మహనీయమైనమధుమాసపుఁబున్నమనాఁడు బిడ్డకున్
మన్మథవేధదీక్ష పది నాళ్లగుమాత్రము నేతదర్థమై
సన్మతి నుండఁగావలయు జక్కనివాఁడవ యక్కవాడలోన్. 198

సీ. అదె నీకుమారిత మదనరేఖాకన్య
వదనరేఖావైభవమునఁ జంద్రుఁ
* దొరఁ గూర్చుకొన్నది ధూర్తదేవత నిన్నుఁ
దండ్రిఁ బోలినయట్టి తరళనయన
సాముద్రికాగమజ్ఞానపారీణులు
కడు భాగ్యసంపదగలది యంద్రు
భాగ్యసంపదకల్మి ప్రస్ఫుటంబయ్యెఁగా
మీర లిందులవచ్చి మీఱియుంట

తే. జనకుఁడవు కర్తవౌజ్ఞవు సజ్జనుఁడవు, క్రొత్తలంజెలకాముండ వుత్తముఁడవు
తొడలనిడుకొని ముద్దుకూఁతునకు నీవు,మించుటద్దంబు చూపరామంచిరాజ.

గీ. కేలఁ గ్రొమ్మించుటద్దంబు గీలుకొల్పి
మంచితొడమీఁద నొప్పారె మదనరేఖ
ముద్దునెమ్మోము లావణ్యమున జయించి
కువలయాప్తుని జెఱ వెట్టుకొన్న కరణి. 200

క. దీవించి మంచి కూఁతురు, "శ్రీవర్ధస్వంబు" చెప్పి చెవి టిట్టిభసె
ట్టీ! వెస నిప్పింపుము సంభావన నొకవెండి బిడ్డ పనుపున కనియెన్.

వ. అనంతరంబ గాంధర్వి పూర్వసంబంధంబునకైన ప్రేమానుబంధంబునఁ గేలు
గేలం గీలించి యిట్లనియె. 202

---

* ధృతి.

గీ. ఎందు వోయితి గోవింద ముందరట్లు, యెందరతివల వలపించి తెచ్చటనెచట
తలఁపు పుట్టించెనే నీకు దైవమిట్లు, పాయసం బారగించిన ప్రాఁతషట్లు.

## శ్రీకాకుళపుఁ దిర్నాళ్లు

గీ. దవనపున్నమఁ గాకుళాధ్యక్షుఁడైన, తెలుఁగురాయఁడు దేవతాధీశ్వరుండు
భువనహితముగ నుత్సవం బవధరింప, నందుఁబోయితి మీపోయినట్టియేఁడు.

గీ. కారవేల్లమతల్లి కాకల్లవల్లి, కడుపు నిండారఁ గాంచినకొడుకుఁగుఱ్ఱ
జారచోరమహాధూర్తచక్రవర్తి, దేవవేశ్యాభుజంగుండు తెలుఁగుభర్త.

గీ. పసిఁడికోర వేఁడి పా లారగించినఁ, బుల్లసిలిన యధరపల్లవమున
విప్రకన్యచనవు వెలయించుచున్నాఁడు, విశ్వమునకుఁ గాకుళేశ్వరుండు.

ఉ. ఈరసమెత్తు వేదములు హీవహించుఁ బురాణసంహితల్
సౌరభహీనమౌ నుపనిషత్తులు లేఁబడు నాగమావళుల్
గారవముల్లసిల్ల సిరికాకుళనాథుఁడు నాగదేవభ
ట్టారకునింటఁ బుట్టి ప్రకటంబుగ వేడుక నాదరింపఁగన్. 207

స్ర. గరుడస్తంభప్రతిష్ఠాకలన మొదలుగాఁ గల్పమంత్రోక్తపుష్పా
ధ్వరపర్యంతంబు కృష్ణాతటినితటమునన్ ద్వాదశక్రోశధాత్రీ
పరివేషాభ్యంతరశ్రీ పరమపదమునం బర్వకాలంబునందున్
బరనారీసంగమాదుల్ భగవదనుమతిం బాపముల్ గాకయుండున్. 208

శా. వ్యామగ్రాహ్యనితంబబింబకుచహారాభీలభద్రాకృతుల్
కామాంధల్ వెలనాటి కోడె విధవల్ కాకొల్ని తిర్నాళ్లలో
నా*మాంధాతృఁడు భీమసేనుఁడు హిడింబాధీశ్వరుం డో పునో
యే మోకాని తెమల్పనేర రితరుల్ హేలారతిక్రీడలన్. 209

ఉ. పేర్చినసందడిం బెదవి పీల్చి రయంబునఁ జన్నులొత్తి చే
దూర్చి యనంగ మందిరము దూకొని కూరిమినీరు జొట్టిలన్

* మాంధాళుఁడు.

గార్చుకొనంగఁ జేసి యిటుఁ గౌఁగిట నుప్పరమెత్తి యేటికిం
ధార్చి రమింతు ర్ధూళుల వితంతువులం దిరునాళ్ల పల్లవుల్. 210

క. ముంజేపదసైన శంబర, భంజను గేహములు గలుగు బ్రాహ్మణవిధవా
పుంజము లుండఁగ నూరక, లంజియ లేమిటికిఁ గాకుళయ తిరునాళ్లన్.

సీ. జవరాలిఁ బొడగన్నసన్న్యాసిపై నేయుఁ
దులసి లేఁజిగురాకుఁ దూపుమరుఁడు
వేదవిప్రునిఁగన్నవిధవపై ఝుళిపించు
దర్భపల్లవహేలి దర్పకుండు
కటకారకులకన్యఁ గనిన హాళికుమీఁదఁ
బొడుచుఁ బూమునికోలఁ బుష్పశరుఁడు
సాడింధమునిఁ గన్ననాతిపై నేయును
నలరుఁజిచ్చుఱకోల నందభవుఁడు

తే. జెరసి వెన్నెల గాయంగఁ బేరకమ్ము
పులినతలముల నాయాయి కోలము లెఱఁగి
తాల్చు శస్త్రాస్త్రములు జారదంపతులకు
నసమబాణుండు తిరునాళ్ల నన్నినాళ్ల. 212

వ. అని యనంతరంబ యాముందటం జనుదెంచు వితంతుసమూహముం గని
యాశీర్వదింపవలయు నని. 213

## వి త ం తు వు లు

సీ. చెలఁగిచెలఁగి హొత్తిచీరలు గట్టెడు మాసకమ్మకు దీర్ఘ మాయురస్తు
సారెసారెకు దేవసదనంబునకు నేఁగు చెడిపెకు సంకల్పసిద్ధి రస్తు
నిత్యంబు వ్యభిచారనిష్ఠతో నుండెడు విధవకుఁ బుత్త్రాభివృద్ధిరస్తు
..దళముగాఁ దులసి పేరులు ధరించినయట్టి విశ్వస్తకారోగ్య విభవమస్తు

తే. మిండమిండకు సంపత్సమృద్ధి రస్తు, వరచుతెంపికి నిత్యసౌభాగ్య మస్తు
వదరుఁ బోఁడికి నీప్సితావాప్తిరస్తు, బలువితంతువు మైథునప్రాప్తి రస్తు.
వ. అని యట చనునప్పుడు. 215

(ఇక్కడ కొంత గ్రంథపాతమై యుండును)

వ. అనిన గాంధర్వి పరదేశపట్టణంబుల వితంతువులచేత పక్షపట్టనంబు
సేయించుకొన మరగి నీవెట్టు మమ్ముం దలంతువు పదపద విచ్చేయు మనుచు
నీర్ష్యాకుటిలం బగు కటాక్షంబునం జూచిన. 216
చ. లవలవఁ జన్నుదోయి గదలన్ దొలుకారు మెఱుంగుఁదీఁగలం
గవకవ నవ్వుడాలు దెలికన్నుల మించులు చౌకళింపఁగా
నవనవ యౌవనంబుగల నాఁటి భవత్పురుషాయితోద్ధతుల్
శివశివ యెన్నిభంగులనుఁ జిత్తములో మఱవంగవచ్చునే? 217
వ. కార్యాంతరవ్యాసంగంబున నార్యవాటికిం బోవుచున్నవాఁడ మనమదన
రేఖాకన్యదర్పణావలోకముహూర్తంబు సుముహూర్తం బయ్యెడుఁ
బోయివచ్చెద ననిె. 218

## నా గ స్వ ర ము

గీ. వెడలి పశ్చిమదిశ నాల్గుగడియ లంత
ప్రొద్దు గలుగంగ నడువీథిఁ బోయిపోయి
కేలిసఖుఁడును దా నాలకించి చనియె
నాగసారముల మ్రోఁత యన్నాగరికుఁడు. 219

## పా ము లా ట

క. నాగస్వరసుషిరసర, న్నాగవరాళ్యాదివివిధనానారాగ
ప్రాగల్భ్యప్రకటఫణా, భోగములై యాడఁజొచ్చె భోగీంద్రంబుల్.
సీ. కద్రూమహాదేవిగారాపుసంతతి మధుకైటభారాతిపడుగుఁబాన్పు
వ్యాళకంకణునియొంటి) గంధసెందారంబు భాసుమంతునిశేరి ప్రగ్రహంబు

నక్షత్రవీథిసెన్నడిమిపెద్దగ్రహంబు మూలాలవాలంబుమొదటిదుంప
యాదిభైరవదేవు యజ్ఞోపవీతంబు క్రీడావరాహంబు తోడిజోడు

తే. యర్కనందనుసెలకట్టె యంపకోల, పుల్లుఁగురాయని తాత్కాలపుణ్యభిక్ష
కేతకీపుష్పవాసనాకృత్రిమాసి, పర్వతేంద్రంబు తరిత్రాడు పాపఱేఁడు.

వ. ఇమ్మహానాగంబులు మనకుం గార్యసిద్ధి యొసఁగుంగాక యని చని
ముందట. 222

సీ. కడగోరఁ దీర్చిన కస్తూరిగీర్బొట్టు నెక్కసక్కెంబుగాఁ జొక్కమెఱయ
నడ్డంబు ద్రికటంబునై యురస్స్థలమున గంధసారస్థాసకములు మెఱయ
జాల నిగ్గులు గుల్కుపాలజెక్కుల కుచ్చు వామకర్ణంబుతో పక్కళింపఁ
బెసచి వెంద్రుకలతోఁ బెనవెట్టి చుట్టిన ప్రాఁతచెంద్రికవన్నె పాగయమర

తే. జన్నిదంబుగఁ బెనుఁబాము సవదరించి
యంఘ్రికటకంబు ఘల్లుఘల్లనుచు మొరయ
నాహితుండికగరళవిద్యాధిరాజు
వచ్చెఁ బాములమెంగఁడు వదరులాఁడు. 223

సీ. ఫూత్కారపవనంబు పూరించుపుక్కిళ్ళ
ముసిఁడిపండులతోడ ముద్దుఁగురియ
సందిటిసంకుపూసలసద్దుకటుతుంబి
నాదస్వరోజ్జృంభణముల నడఁప
నేడు రంధ్రములు నిరుఁగేల వ్రేళ్లను
వివృతిసంవృతిలీల విస్తరింప
నాలాపతాళాంతరాంతరంబులయందు
వికృనుశబ్దముల్ చొక్కటముగ

తే. నాగసింధుప్రభేదనానావరాట, రాగగంధర్వలహరికారంభణముల
మిహిపదంబుగఁబాములఫొంగఁ డూఁద్భభోగిరాజాలువర్తింపనాగసారము.

వ. టిట్టిభ ! యవలోకింపు నారికేళబకజాతీయంబులై యీజగజెట్టి గోడి
పుంజులు మెడలునిక్కించుచు రెక్కలల్లార్చుచుఁ "గొక్కొక్కొ"యని
కాల్ద్రివ్వి క్రొవ్వుమిగిలి తరళతారకోద్వృత్తరక్తాంత లోచనమండలంబులై
యొండొంటిం గదిసి చుఱచుఱంజూచి యేచిన కోపాటోపంబున
గుప్పించి యుప్పరం బెగసి చరణాంగుళీకుటిల నఖశిఖాకోటికుట్టనంబుల
జిరుఁ* దొగడులెగయఁ వక్షస్స్థలంబులు వ్రచ్చి వందరలాడియుం
ద్రోసియు లాసియు నాసాపుటంబులం బుటబుటననడు నెత్తిం జొత్తిలు
నెత్తురు విఱ్ఱఁగాఁ గఱచియుఁ బఱచియుఁ గొఱకొఱం గొఱుకుముఖంబున
గురుకుగురుకు మనుచు సవ్యాపసవ్యంబుల నోహరిం బక్ష విక్షేపంబులం
బడలువడనడిచియు నొడిచియు నడికినడికిఁ దప్పించుకొని సడిచప్పుడుగాక
యుండం గాళ్లక్రిందికిఁ దూరియు జీరియు మాటిమాటికి "ఘాటఘాట
ఘాట" యని కృకాటంబుకుఁ దండసంబులు వోనిముక్కులం
జెక్కులం జిక్కఁగా నొక్కి యిట్టట్టనక బిట్టూనిపట్టి గాలంపుఁ
గొంకులభంగి వంక లగుకొంకికత్తులం గడుపులొడిచికొని చించి చెండాడి
కొండుకసేపు వాలిసుగ్రీవుల విధంబున, విందానువిందుల చందంబున,
మురారిచాణూరుల ప్రకారంబున, నేకాంగయుద్ధంబు సేసి చారణగంధర్వ
గరుడ విద్యాధర శ్లాఘనీయంబుగా నమోఘపరాక్రమంబు సలిపి
వీరవ్రతం బేపార వాహ్యాళీమండలంబునం దమకుఁదార పాయగిలం బడి
పోటుగండ్ల రొప్పు రుధిరంబులం దొప్పఁదోఁగి మూర్ఛాంధకారంబున
మునుంగుచున్నయది. 235

సీ. హా ! కుమారస్వామియానవాహ్యములార హా ! మంత్రదేవతాస్వాములార
హా ! కాలవిజ్ఞానపాకకోవిదులార హా ! భూతభుక్తికుంభార్హులార
హా ! యహల్యాజారయభనహేతువులార హా !బలాత్కారకామాంధులార
హా ! నిరంకుశమహాహంకారనిధులార హా ! కామవిజయకాహళములార

---

* దొడ.

తే. హా! ఖగేంద్రంబులార కయ్యమున నీఁగి
పోవుచున్నారె దేవతాభువనమునకు
మీరు రంభాతిలోత్తమామేనకాది
భోగకార్యార్థమై కోడిపుంజులార. 236

వ. అని యటపోవుచు నాదక్షిణంబున పైఁడిపుండల మొగసాలతోడిది
మాధవశర్మకూఁతురు మధుమావతిదేవి మందిరంబు. 237

## మధుమావతి యిల్లు

గీ. సింహళద్వీపమునఁ గాని సృష్టిలోనఁ, బద్మినీజాతి లేదనుపలుకు కల్ల
తెఱవ మధుమావతీదేవి దేవకన్య, పద్మినీజాతి దోర్గంటిపట్టణమున. 238

చ. మలయజగంధి యైనమధుమావతి యూర్పులకమ్మఁదావి చెం
గలువల సౌరభంబునకుఁ గాదిలిచుట్టము చక్రవాకులం
గలకల నవ్వు దానిచనుకట్టు తదీయవిశాలనేత్రముల్
తొలకరి క్రొమ్మెఱుంగు సయిదోడులు మిండలు గండుమీలకున్. 239

ఉ. టిట్టిభసెట్టిగారు వినుఁడీ! యొకచొక్కపుజోగి రేయి రో
వట్టిడి దినినోఁ గలసి భైరవతంత్రముఁ దీర్చి మెచ్చి సౌ
ధాట్రమునన్ లిఖించె నఖరాక్షరభంగిఁ దెనుంగుఁబద్యమున్
బుట్టువు పేరనాగతము భోగము భాగ్యముఁ బ్రస్ఫుటంబుగన్. 240

క. ఈతలిరుంబోడికిఁ గల, భూతభవద్భావికాలముల జన్మములన్
జాతులు ప్రస్ఫుటములుగా, నాతఁడు లిఖియించెఁ బద్య మల్లదె కంటే!

సీ. అలకాపురంబున నంగారవర్ముఁ డన్ గంధర్వపతికన్య కమలపాణి
యాదివ్యగంధర్వి కపరావతారంబు మధుమావ తోర్గంటిమండలమున
నాసుందరాంగి దక్షారామమునఁ బుట్టు భువనమోహిని చిన్నిపోతియనఁగ
నట్టిసత్ స్త్రీజాతి యాసానికూఁతురు చిరకాలమున సదాశివునిఁ గూడి

తే. పావనం బైన తమిలేటిపరిసరమున, వేగిపరువాటికాదేశవిపినభూమిఁ
గోవులను పేరిచెంచులకులమునందుఁ, గడిమిగత్తులయమ్మి నాఁగలుగఁగలదు.

గీ. కడిమికత్తులమ్మి నిడువాలుఁగన్నులు, గండుమీల నడుచు ఖండగీఁడ!
ధానిచన్నుదోయి ధారాసురత్రాణ, కటకకుంభికుంభకలహకారి. 243

## మదాలస

వ. ఈ మధుమావతీదేవి చెలియలు మదాలస *నామామ మోసాలప్పఁడుసిద్ధ
వేదులకొడుకు శ్రీధరునకు ననుపులం జెరయై యుండు; నాఁటంగోలెఁ
దగిలి యారంజకుం డచ్చోటనే యున్నవాఁ డని నిస్సార మపసగుణము
గాక యనుచు మోసాలం జొచ్చి కక్ష్యాంతరమ్ములు గడచి గొజ్జు
టోవరిముందట గటకంబళంబులమీఁదఁ బదుగోఁ జిటపోటవోఁపుచుం
గూడియుంగూడకయున్న యప్పచెలియం ద్రను మామయూస్త్ర జూని
జూచి గోవిందుండు మందస్మితంబున. 244

గీ. ఆహా వెట్టితి జొన్నగడ్డాగ్రహార, వృత్తి యేనూఱుగూఁడలప్రస్తమునను
ననుభవింపుఁడు నీవు మదాలసయును, నరససంసార మింతయు నధ్రువంబు.

గీ. మిన్న కున్నార లిది యేమి మీరు ముగురు
నీఁగకును బోకవెట్టినయిట్టిభంగి
హెచ్చుగుంది దింతమాత్ర మేదేని గలదె
మిగులఁ గోపంబు మీకు లేమియును దోఁచె. 246

వ. అనిన మధుమావతి గోవిందమంచనశర్మతో నిట్లనియె. 247

సీ. ఏమి చెప్పుదుము మా కీవు తోఁబుట్టుగ వైనను జెప్పక యడఁపరాదు
నీదువియ్యంకుండు నిర్భాగ్యుఁ డీతండ యీపాటియినట్టిరే యేకతమున
మామదాలస కేళిమందిరాంతరమున హంసతూలికపాన్పు నందు నొంటి
నిద్రించి యుండంగ నీవిబంధం బూఁడ్చి యటు చేయవలసినయట్టు చేసె

* మన.

తే. మధుమదారంభమున మేను మఱచి యపుడు
మోసపోయితి మీనాఁడు ముట్టఁ దెలియఁ
జెలియలికి నాకు గొడ్డేఱుకలఁకవుట్టె
బ్రాహ్మణుఁడె వీఁడు విశ్వాసపాతకుండు. 248

క. నడురేయి మధుమదంబున, నొడలెఱుఁగకయున్న నన్ను నోవరిలోనన్
దడవెను గుడిలో నుండియు, గుడిఱాళ్లను దీసె వీఁడు గోళకుఁ డరయన్.

వ. పాడిపంతంబు లెఱిఁగిన పెద్దవు నీవు మాభాగ్య కృతంబున విచ్చేసితివి
యజ్ఞానకృతంబునకుం బ్రాయశ్చిత్తంబు విధింపు మని మఱియును. 250

శా. హాలాపానమదాతిరేకమునఁ బర్యంకంబుపై నొంటి ని
ద్రాలస్యంబున నుంటదక్క, మఱి యే యన్యాయముల్ చేయ నే
నేలా పాపము గల్గె? నీభయము వోనే ముట్టెదన్ శుద్ధికై
వాలాయంబును మీనకేతనుని దివ్యశ్రీపదాంభోజముల్. 251

వ. అనిన గోవిందుండు మీరు విటజన ధర్మసూక్ష్మం బెఱుంగ రిది యన్యా
యంబు గాదు వేశ్యాజనంబునకు వావివరుస యెక్కడిది? తొల్లినముచిసూ
దనునకు ననుపులంజెయై యూర్వశి యతని కొడుకుఁ గవ్వడిం గామింపదే?
రావణుండు నలకూబరుని రంభోరు సంభోరుహాక్షి రంభం గోడలిని
సంభోగింపక సాగ నిచ్చెనే? వారకాంతను దల్లి, దాసి, యప్ప, చెలియలు,
కూఁతురు, దాదియని కేళికాగేహంబునం బరిహరించుట విటధర్మంబుగాదు.

గీ. జాణతనము గల్గి సవరతనము గల్గి, తెలివి గల్గి మోరతీరుగల్గి
చేయలంతి తనకుఁ జేకూడినప్పుడు, వావి వలదు లంజెవారియింట. 253

వ. అనిపలికి సౌముఖ్యంబు సంపాదించి. 254

చ. వదినెయు, లంజెయున్, విటుఁడు, వైరము లాత్మల నుజ్జగింపఁ డ
భ్యుదయపరంపరావిభవ భోగము లందుఁడు మేము వోయివ
చ్చెద మని వారిసత్కృతులు చేకొని మంచనశర్మ వెళ్లెఁ ద
త్సదన మపారభాగ్యధన సంపద కెంతయుఁ జోద్యమందుచున్. 255

చ. కొడుకులు గూఁతులుం గలిగి కూడునుఁ బాడియుఁ ద్రవ్వి తండమై
ఒడిముడి లాఁతుగాఁ గలిగి వెండియుఁ బైఁడియు నిండ్లలోపలన్
దడఁబడఁ దారు బంధువులుఁ దామరతంపరలై సుఖించువా
రుడుపతిమౌళి మౌళి నొక యుమ్మెత్తపూ విడువారు పేదుకన్. 256

## సూర్యాస్తమయము

వ. అనుచు మధుమావతిదేవి భవనంబు వెలువడి కట్టాయితం బైన ఘటశాసిపుంగవుండు నింగిచెఱంగు మొన వ్రాలిన పతంగబింబంబుఁ గనుంగొని 'టిట్టిభ! యదె చూడు, వరుణరాజ వారాంగనావిలాసదర్పణానుకారియై యహర్పతి గ్రుంకంబోయె నింక మనకు నేపంకం బడయఁబనిలేదు కుహాళీచషకంబుల నారికేళంపు మధువుం గ్రోలి మత్తిల్లి వీరె మందిరోద్యానవీథులం బల్లవాధరలు పుష్పగంధికానృత్యంబులు వగిధవించెదరు; వారు కొందఱు మందిరప్రాంగణంబున వారాంగనాజనంబులు విచిత్రశ్లోకంబు లనేక రాగంబులం గూర్చి లాస్యాంగం బుత్తమంబుగాఁ జూపెదరు; మఱియు నంత రాంతరంబులం బ్రచ్ఛేదన సైంధవ ద్విమూఢకస్థిత పాఠ్యాభిమార్గాభినయ భేదంబులు రసభావభావనామోదమధురంబుగా శాతోదరు లభినయించెదరు. ఇవ్విధంబున వినోదంబు లిన్నియుం జూడం దలంచితి మేని కామమంజరీ గృహప్రవేశంబునకుం గార్తాంతికుండు పెట్టిన ముహూర్తంబు సరిగడచు నిపుడు పుష్యనక్షత్రంబున నాల్గవ పాదంబు నడచుచున్నయది కాలావర్తవిషనాడి కాస్పర్శనంబులేక యమృతద్వంద్వంబుగూడి యందుబింబాననాధరోష్ఠపల్లవామృత పారణలాభంబునకుం గారణంబు గాఁ గలిగియున్నయది యివ్వేశవాటంబు వీథీవిటంకం బతిక్రమించి వేవేగం జనవలయు నిదె యాఁటది యొక సురపొన్నక్రిందఁ క్రీడాభరంబున గన్నియలం గూడి కందుకక్రీడ యొనర్చుచున్నయది దీని నలవోక వారె త్రైవం జూడవలయు నని చూఁడగ జని. 257

## బంతులాట

శా. పంచారించిన లేఁతచన్నులపయిం బ్రాలంబముల్ గ్రాలఁగాఁ
గాంచీనూపురకంకణక్వణనముల్ గర్జింప బాలాజనుల్
కించిన్న్యంచదుదంచితక్షమముగాఁ గ్రీడించెద రూచ్చాదుమా !
చంచత్కాంచనకందుకత్రయములన్ సవ్యాపసవ్యంబులన్. 258

## నట్టువునికోడలు

వ. అనుచుం గతిపయపదంబు లరుగఁ గట్టెదుర నొకనట్టువునికోడలు గోడలు నక్కఁజూడఁ బొడగని యమ్మచ్చెకంటికి మున్న దన్నెఱిఁగినది యగుట టిట్టిభున కెఱింగించి గోవిందమంచనశర్మ యి ట్లనియె. 259

క. వ్రాలె నరవిందలోచన, పాలిండులు చూడఁజూడఁ బ్రసవాంత్యమునన్
ఏలా యీమాటలపని?, వ్రాలుట చోద్యంబె చక్రవాకులకోదమల్.

వ. అనుచుం జనునప్పుడు ముందట నొక సైరికునిం గని టిట్టిభునకుం జూపి యి ట్లనియె. 261

## సైరికుఁడు

గీ. మాఘమాసంబు పులివలె మలయుచుండఁ
బచ్చడం బమ్ముకొన్నాఁడు [1]పఘరమునకు
ముదితచన్నులు పొగలేని ముర్మురములు
చలికి [2]నొఱగోయ కే లుండు సైరికుండు. 262

ఉ. దిక్కరికుంభకూటముల దీకొనుచన్నులు కాముతేరిపై
టక్కెపుగండుమీల నునుడాల్కొనుకన్నులు, క్రొమ్మెఱుంగుతో
నక్కవమాడు మేనిపస యొప్పఁ గల్గునె యోరుఁగంటియం
దక్కలవాడలోని వెలయాండ్రకుఁ దక్కఁ గిరాట టిట్టిభా ! 263

1. పణములకును. 2. నొఱసేయ.

వ. అనుచు నటచని వేశవాటంబు వెడలి భైరవాలయద్వారంబునఁ బాడి
పంతంబునం గూడిన పౌరవిటలోకంబుం గనుంగొని యేమి ధర్మాసనంబుఁ
దీర్చెదరొకో యని యడిగిన. 264

## జారధర్మాసనము

సీ. మును తనకూఁతు దీముగఁ జూపి రోవట్టు
పరదేశివిటునిచేఁ బణము *గొనియు
ననుపుపల్లవుని సన్నకుసన్న రప్పించి
యతనిశయ్యకు దాని ననిపిపుచ్చి
కైసేసి తనయింటిదాసి నావిప్రున
కాతిథ్య మొనరింప ననుమతించె
దాని నాద్విజుఁడు ప్రాతఃకాలమునఁ జూచి
బెడదవెట్టిన యప్పు బెదరవయ్యె
తే. పిల్ల కోపంబుతో నిల్లు వెళ్లివచ్చి, తలవరుల క్రిప్రసంగ మంతయును జెప్ప
వారు రప్పింపవచ్చె నీవవరుజఱభి, లంజెతల్లియె యిదియు గుల్లాముగాక.
వ. అనిన నజ్జఱభిభయంబు నొంది సభాసదులకు దండప్రణామంబు సేసి
యాత్రవిభు నుద్దేశించి. 266
శా. నీకుం జేసినబాస యెట్టిదియొ తుండీరద్విజశ్రేష్ఠ! మా
రాకాచంద్రనిభాస్య కాకలిమహారాజేని: బుత్తెంచినం
గైకో; దెట్టులు నేమి సేయుదును; శృంగారంపులేఁదోఁటలోఁ
బైకొం గెత్తి, కుచంబు లొత్తి, పరిరంభం బీదు లేఁ గ్రోవికిన్. 267
వ. మమ్ము నూరక రట్టుసేయుట ధర్మంబు గా దనుచున్నయాధూర్తజఱభిం
జూచి యవ్విటలోకంబు "ప్రౌఢ నొక్కనినిమిత్తంబున భంగపెట్టు ట
యుక్తం" బని "నీవు విటధర్మంబు దెలిసినవాఁడ వానతీయవలయు"
ననిన గోవిందుండు. 268

* గినిపి; గినిసి.

క. కందర్పశాస్త్రవేదులు, నిందుకు షాణ్మాస-చింత యేలా ? తెలుపన్
సందేహింపక గొఱిగిం, పందగు నీజఱభిజుట్టువట్టి రయమునన్. 270

గీ. ముక్కుసోణంబుదాఁకను జెక్కు టొకటి
బోసినోరుగఁ బండ్లూడఁ బొడుచు టొకటి
గూబ లంటఁగఁ జెవిదోయి గోయు టొకటి
లంజెతల్లి యొనర్చుకల్లలకు శిక్ష. 271

వ. మాకుం దోఁచిన ధర్మంబుఁ జెప్పితిమి. యథాపరాధంబుగా నీయధమ జాతిని దండింపుఁడు మఱియు నొక్క విన్నపంబు. 272

మ. స్మరదివ్యాగమకోవిదుల్, మదనశిక్షాతంత్రవిద్యావిదుల్,
సురతారంభమహాధ్వర ప్రవణు, లిచ్చో నుందు వేశ్యావరుల్
తిరమై నాకు ననుజ్ఞ యిం డిపుడు (తార్తీయాకమై యొప్పున ?)
ప్పురుషార్థంబు తెలుంగఁబోయెదఁ బునర్భూభామినీవాటికిన్. 273

(ఇక్కడను గొంత గ్రంథపాత మయి యుండును.)

## నిశాముఖము

వ. అనంతరంబ భాస్వంతుండు వరుణరాజశుద్ధాంతకాంతానివాసమాణిక్య దర్పణం బై చరమగిరికటకకాననంబు మాటునం జాటువడియెఁ, గాశ్మీర పరాగ చ్ఛటాభాసురం బైన సంధ్యారాగంబు నింగి నింగిలీకంబునం బెట్టి క్రీడోద్ధూతధూర్జటిజటాజూటవల్లీమతల్లికామల్లికాకోరకాకారంబులై తారకంబులు వియత్తలంబునఁ దళతళ వెలింగె, విభావరీపురంధ్రీకర్ణపూర చాంపేయ కుసుమ సాదృశ్య సౌభాగ్య సంపత్సంపాదన లంపటంబు లై భువనప్రదేశంబులు ప్రకాశించె, నెఱసంజయు మసమసకని చీఁకట్లునుం గలసి దిక్సౌధకూటవాటీలకురుంబంబుల ప్రేలవిడిచిన కురువిందపూసల పేరునుంబోలె పొలుపుమిగిలె నప్పుడు గోవిందశర్మ గోధూళిలగ్నంబున

నార్యవాటికఁ బ్రవేశించి కామమంజరీ చౌర్యరతి విహారసంకేతస్థలంబు లైన రథ్యాముఖ శివచత్వరప్రపామంటపంబులు విలోకించుచుఁ గులటాఫాలతిలకంబులకుం గుంటెనకత్తియ లగు కొల్తైమజంగమబోడి తలకుం గ్రేఁగంటిచూపుసన్నఁ దనరాక యెఱింగింపుచు, నవ్వేళకుం జూడ గూఢవివిక్తంబునుం, బూర్వపరిచితంబునుం, బురుషశూన్యంబును, వివాహకాలోచితవృత్తస్తనభారవివిధవిలాస విప్రవాసకన్యాసనాథంబును, విశ్రామస్థలంబును నైన యొక్క తమ్మడిసానిమందిరంబున విడిసి, తనరాకదేవయాత్రామిషంబున నప్పూజరివిధవచేత నెఱింగింపం బంచి, వీరభద్రేశ్వరస్థానంబువెనుక బొడ్డనబావియందు గృతసంధ్యావందనుం డై నిజాంతర్గతంబున. 274

ఉ. కంగటికాలు పుచ్చుకొని ఖంగనఁ గాలుకిరీటకూటముల్
లొంగఁ గొనంగ లేరు, రవి నోరుఁ దటాలనఁ బన్న లేరు, క
న్నింగల మూని దర్పకుని నేర్చఁగ లేరు, లలాటపట్టకో
త్సంగము చేరు సేయహహా! తక్కటివేల్పులకై మదంజలుల్. 275

వ. అనుచు శివార్చనంబు దీర్చి సుఖాసీనుండై టిట్టిభునితో ని ట్లనియె. 276

మ. వదనాంభోరుహఫూత్క్రియాపవన నిర్వాణప్రదీపంబు
... ... ... ... ... 277

చ. పొదలినచీకువాల నడు ప్రొద్దున యౌవనగర్వవిక్రియా
మదమున వింజ మా కిడిన మాడ్కిఁ బురంబు జనంబు నిద్దురం
గదలినవేళ నాయెడకుఁ గామినిరానలవాటు సేతకై
... ... ... నిమీలితాక్షి యై. 278

ఉ. దట్టపునీలిచేల గడితంబుగఁ గచ్చ బిగించి, ద్రిండుగాఁ
గట్టి కటారికోల కరకంజమునం ధరియించి, గుబ్బచ

న్కట్టునఁ దోఁపుటంగి తొడిఁ, గ్రక్కున నన్నడు రేయి వచ్చి, నా
కట్టెదురం జోహారు లనుఁ గాంత భటుం డయి నవ్వటాలకున్. 279

వ. అనుచుం జెక్కుప్రకారంబుల నాకాముకుండు పూర్వవృత్తాంతంబు కట్టనుంగుఁ జెలికాఁడైన కిరాటటిట్టిభ సెట్టితో నుబ్బున నుగ్గడింపుచుఁ గామమంజరీ సందర్శనోత్కంఠాతిసంకులం బైన చిత్తంబు మన్మథాయత్తంబై యుండఁ, గొండంతయాశతో ధార్మికధర్మపతి యెప్పుడువచ్చునో యని యుఁవ్విళూరుచుం దృణంబు చలించినం, జీమచిటుకన్నను, జెవివ్రాలం బెట్టియాలించుచు, భామినీవిలోకనోత్సవం బాసన్నంబగుటం జేసి

... ... ... ... ... ... ... ... ...

దీపంబునుంబోలెఁ బరితాపంబు వహించుచుండ, నంతఁ జంద్రుండు పురందర హరిద్దరీకుహరగర్భాంతరాళంబున నుండి కంఠీరవంబునుంబోలె మింటికి లంఘించి మయూఖనఖరంబులం దిమిరకుంభికుంభంబులు వ్రచ్చి వం దఱలాడి నభఃక్రోడంబున నుడుగణంబు లనుముత్తియంబుల వెదఁజల్లె నావేళ నిండువెన్నెలగాయఁ బ్రాణనాయకుండు వచ్చుటఁ గని విని పరమహర్షోత్కర్షంబున. 280

సీ. వీరభద్రేశ్వరార్చనావిధి నెపమున, ... ... ... ...
... ... ... ... ... ... ... ... 281

## కామంజరి

మ. కరపద్మంబునఁ బైఁడిపళ్లెరమునం గంధాక్షతల్ పచ్చక
ప్పురముల్ వీడెము గొంచుఁ గ్రొత్తమడుఁగుం బొన్పట్టునీరంగితో
మురిపెం బొప్పఁగ వచ్చెఁ జౌర్యరతసంభోగార్థమై కామమం
జరి గోవిందునియొద్దకున్ శివనమస్కారచ్ఛలం బొప్పఁగన్. 282

క. మోదంబున రాకాచంద్రోదయదేవతయుఁబోలె నొయ్యనఁ జని శా
తోదరి గోవిందుని శ్రీపాదంబుల కెఱఁగె భక్తిభయలజ్జలతోన్. 283

ఉ. మచ్చికయుం బ్రమోదమును మన్ననయున్ నయమున్ విలాసమున్
మెచ్చును నేర్పడంగ దనకు మేయిడి మ్రొక్కిన కామమంజరిన్
గ్రుచ్చియుఁ గౌఁగిలించె నిజు గుబ్బచనుంగవ రెండుఁ గ్రేవలన్
బచ్చనివింటిజోదు పయి పైఁ బులకంబులు నారువోయఁగన్. 284

వ. అనంతరం బాసనాసీను లైన నగ్గోవిందుండు కామమంజరిం జూచి. 285

మ. అరవిందాస్య! తలంచి చూడ నిది యత్యాశ్చర్య మోకాని నీ
సరసాలాపము లాదరించి వినఁగా సంభావనం జూడఁగన్
ఖరపాకం బయి కర్ణరంధ్రముల కంగారంబుగా బిట్టుని
ష్ఠురముల్ పల్కెడు రాజకీరములు గండుంగోయిల ల్వీణియల్. 286

వ. అని జారదంపతులు పూజరివారియింటిముంగిట వెన్నెలబైటనుండి టిట్టి
భునకుం గట్టాఁడిము త్తియంబునుం బోన్ని తమ్మడి*సానికిఁ గూఁతుంగూర్చు నేర్పు
విచారించి సన్నపు టెలుంగునం బూజరిసానిం బిలిచి కనకనిష్కంబుతోడఁ
గూడఁ గర్పూరంబు వీడియం బచ్చేడియచేతిలోనం బెట్టి యాపాద
మస్తకంబువీక్షించి శిరఃకంపంబు నేసి. 287

సీ. బంగారుతలుపుల్లు పాయ్యంగ ఘట్టించి లావణ్యవిత్త మేలా వ్రయించె
లావణ్యవిత్తమేలా వ్రయించుఁగాక యతిమాత్ర మేలా ప్రయాసపడియె
నతిమాత్ర మాయాస మనుభవించునుగాక విటజనంబుల నేల వెడ్డుకొలిపె
విటజనంబుల కారవేరంబు సేయఁగా నేల నిర్మింపఁడో యెనయు మగని

తే. సొమ్ముపోక మహాప్రయాసమ్ము రాక, ప్రజలబాధ నిరర్థకారంభణంబు
తెలమి సిద్ధింప నేమిగాఁ దలఁచెనొక్కొ, సరసిజాసనుఁ డీతలోదరిసృజించి.

చ. ధోరసెమునందు చుట్టుకొని తోరణకట్టె నురోవిభాగమున్
నిరుడు పయోజకోశరమణీయతఁ దాల్చెను, వర్తమానవ

---

* సానిం.

త్సరమున నొప్పె హేమకలశంబులబాగున, ముంద టేటికిం
గరినిభయానచన్నుఁగవ కౌఁగిలిపట్టులు గాకయుండు నే. 289

గీ. సన్నచూపులఁ బూజరిసానిఁ బిలిచి, పసిఁడిటంకంబు పరిరంభపణము సేసి
టిట్టిభునితోడ నేఁడు కూడింపు కూఁతు, నేకశయ్యా సహాయసుశ్రీకి మించ.

క. కన్నె ఱికమ ముడుప వేణే, సొన్నాటంకములు రెండు చుట్టంబులలోఁ
గన్నమొఱంగెడు నేర్పును, విన్నాణము మాకుఁ గలదు వెఱ పేమిటికిన్.

వ. అని యనుతింపం జెప్పి బొమలమీఁద వెండ్రుకలు వ్రాలుపూజరిసాని
బిడ్డను పెడ్డుపెట్టి టిట్టిభుని చేతి కిచ్చి యచ్చ వెన్నెలలం బొరపొచ్చెంబు
లేని మచ్చికల చంద్రమండలంబుమీఁద దృష్టినిలిపి టిట్టిభుండు విన
ని ట్లనియె. 292

సీ. కలశపాథోరాశిగారాపునందన ! కల్యాణములు మాకుఁ గలుగఁజేయు
కుసుమకోదండునికూరిమినూమ ! సౌఖ్యాభ్యుదయంబు మా కాచరింపు
రాకావిభావరీరమణీమనోహర ! సంతోషములు మాకు సవదరింపు
శౌరిపట్టపుదేవికూరిమిసయిదోడ ! యైశ్వర్యములు మాకు నాచరింపు

తే. మనుచు గొజ్జంగి నీరను నర్ఘ్యమిచ్చి
పచ్చకప్పుర మందంద జడిసివైచి
మ్రొక్కి రనురాగసంపద మూరిఁ బోవ
జారజాయాపతులు నిండుఁజందురునకు. 293

క. నటులది దోరసముద్రము, విటులది యోర్గల్లు కవిది వినుకొండమహా
పుటభేదన మీత్రితయము, నిటఁగూర్చెను బ్రహ్మ రసికులెల్లను మెచ్చన్.

చ. ముదమున ముల్కినాఁటిపుర మోహనశైలసువర్ణకందరా
సదనుఁడు కాలభైరవుఁడు శంభునిపట్టి సమగ్రవైభవా
భ్యుదయపరంపరావిభవముల్ గృపసేయుఁ గవీంద్రకాంక్షిత
త్రిదశమహీరుహంబునకుఁ దిప్పయవల్లభరాయమంత్రికిన్. 295

వ. అని యందఱును యథాసుఖంబుగ నిజస్థానంబుల కరిగి సుఖయించుచుండిరి.

గద్య. ఇది శ్రీమన్మహామంత్రిశేఖర వినుకొండతిప్పయామాత్యనందన
చందమాంబాగర్భపుణ్యోదయ సుకవిజనవిధేయ వల్లభరాయ
ప్రణీతంబైన క్రీడాభిరామం బను వీథినాట
కంబున సర్వంబు నేకాశ్వాసము
సంపూర్ణము.



# పద్యసూచిక



* ఈగుర్తుగలవి వచనములు.

# కఠినపదములకు అర్థవివరణము



పద్యసంఖ్య.

2. త్రైశంకవము=త్రిశంకుని (హరిశ్చంద్రుని తండ్రి) కొఱకు నిర్మింపఁబడినది.

3. ద్యావాపృథ్వ్యులు=భూమ్యాకాశములు; చంద్రాతపము=వెన్నెల.

4. ప్రాలంబసైషణ్యము = కంఠహారమనెడి యలంకారము.

5. అభ్యర్ణుఁడు = హితుఁడు.

13. ప్రత్యగ్ర = నూతనమైన.

17. రారాజు = దుర్యోధనుఁడు; రైరాజు = కుబేరుఁడు.

20. శ్రుతపర్వతము = వినుకొండ.

24. విస్ఫుమర = వ్యాపించు.

32. వారుణి = మద్యము; కుర్కురము = కుక్క.

41. పునర్భువు = మాఱుమనువు చేసికొన్న స్త్రీ; సంధుక్షణము = రాఁజఁబెట్టి పెంపొందించుట.

42. జలపోసనము = మొలాము; జటికొన్న = సరిగచుట్టిన.

45. అక్కిలిఁజేయు =ముడుచుకొన్నఁజేయు; పందు = సందు (మధ్యప్రదేశము) లోనికిఁ జేర్చు; ఇరుచంబడ = కుదియఁబడ; గుమ్మడిమూట = గుమ్మడిపండువలె గుండ్రమగుమూట.

46. తోఁపురెంటము = జంట నేఁతనేసినయెల్లిదుప్పటి; నఖంపచము=గోరువెచ్చని.

47. ప్రాలేయము = మంచు.

50. కోటఁడు = గ్రుడ్డిగూబ.

51. మాఁగిలి మాఁగిలి = ఆఁగియాఁగి; పూఁగొమ్ము = పూఁగొమ్మ.

52. వలతీరు=కుడివైపుగతి; శాకునికులు = శకునశాస్త్రజ్ఞులు.

54. దమ్మదార=ధర్మదార (యుద్ధాంతజ్ఞాపకముగానూఁదెడి బాకా) శబ్దమునకు ప్రాకృతరూపము.

56. ఉపాధి = ఉదయము; శిథిలము = చిక్కఁగఁ జేరుకొన్నది. గోత్రస్ఖలనము=ముఱొక నాయికనామ ముచ్చరించుట.

59. ప్రావృట్కాలము = వర్షర్తువు.

పద్యసంఖ్య.

60. ఉత్తృణము=ఎగిరిపోయిన గడ్డి కప్పుగలది; కంకటి = మంచము.

62. త్రసరించు = ఎగతాళి సేయు; సొబగుపీడు = చెఱఁగుమాయు = బహిష్ఠయగు.

64. కాశ్మీరక్షోదము= కుంకుమపొడి.

68. పచరించు=ప్రకటించు; దిస్సువాఱు = దిస్సుమను; వైణవకాష్ఠము=వెదురుకఱ్ఱ; బరిగోల = ములికి.

69. పుటభేదనము = పురము; కటకారుఁడు = మేదరి.

71. తారము = వెండినాణెము; పల్లవము=రొక్కపుజాలె; పటీపల్లవకోణము = సన్నని బట్టయంచు.

73. గండాభోగము = చెక్కిళ్లయం దంతట.

75. ఘటీభారము=కుండబరువు; ఘటితాళించు = బెళుకుసూపు.

77. మైలసంత = ఊరివెలుపల నిమ్నజాతులకొఱకేర్పఱచినసంత; సుసరభేత్తు = రోమనాశని.

80. సజ్జికము = మనోజ్ఞము.

81. నిర్యాసము = జిగురు.

82. పురుషాయితము = ఉపరతి.

84. ఆలపము = ప్రకాశము.

85. కృకాటిక=అవటువు=పెడతల.

పద్యసంఖ్య.

86. కుసుమ=కుసుంబరంగు; అప్పసము = అవశ్యము.

88. నోవు = బాధ.

90. పంచారించిన=కుదురునిండిన; ణిసిధాత్వర్థము = చుంబనము.

92. పిసాళము=వేళాకోళము; టాటాలు = వ్యర్థపుమాటలు.

95. నిచ్చరించు=పైకివ్యాపించు.

101. మొరవంక = అంచువలె వంకగైన; జంగాళముగ = పొడవుగా.

103. తిరుగుటెద్దు = గానుగెద్దు; ప్రతోదము=కొరడావంటిజాక.

105. దాత్యూహము=వానకోయిల; మోహరిపాడు=సైనికులుండుపేట.

106. సైచికుఁడు = కుట్టుపనివాఁడు; కంచెల = అవికె. [నెఱ్ఱనైన.

108. గోరఁటయెఱ్ఱ = గోరంటాకున

112. గనప=పెద్ద; వంకదార = గవనికి ముందఱిద్వారము.

114. అక్కలవాడ = వంటపూటిళ్ళుండుప్రదేశము.

115. ఆలువరి = కోటప్రాకారము యొక్కవప్రము.

125. త్రిక్కూటి = ముక్కోణము; నాసీరము = సేనాముఖము.

128. గవద = పెద్ద

131. జనంగముఁడు = మాలఁడు; మధ్యానద్ధ = మొలను గట్టఁబడిన.

పద్యసంఖ్య.

133. శంభళి = కుంటెనకత్తె.
134. జీలగందము = పూఁతపసుపు.
136. ఉరుమ = వాద్యవిశేషము.
138. తన్వవలగ్నము=సూక్ష్మమయిన నడుము.
142. హాటాస్నాళంబు=బంగారుపీడి; మిసిమింతుఁడు=అలసినవాఁడు.
143. స్పటికసీల=అడ్డిగెసీల; గొరగ పడుచు = భక్తురాలు.
147. శీధువు = మద్యము.
153. కోయష్టి = కొక్కెర; మైరేయము = మద్యము.
157. బంధకి=జారిణి. [బాపఁడు.
159. తేడఁగ = వెదకఁగ; బాఁడు=
166. లప్పలు = సమృద్ధి. [చు.
168. బఱివోవు=హద్దుమీఱి వర్తిం
169. విశ్వస్త = విధవ; సౌవర్ణ = సువర్ణమయమైన; సుషమ=శోభ.
175. పెరుమాళ్ళు = విష్ణువు (శివపూజకుఁ బనికిరాకున్నను మొగలిపూవును విష్ణుపూజనమున నుపయోగింతురు.)
188. కటకము = రాజధాని.
192. మర్యోర = వెంద్రుకలవలె సన్నసగుతంతులచేఁ గూర్చినతూలిక; ఈవిపస = ఇవ్వఁగలిగినంత.
194. గాంధర్వి = వేశ్య; అడియాలము=గుర్తు.

పద్యసంఖ్య.

196. యాయజూకుఁడు = యజ్ఞములుచేయువాఁడు.
197. వివర్తము = నృత్యము.
199. దొరఁగూర్చు = సరిగాఁబోలియుండు.
201. శ్రీవర్ధస్వంబు=సిరివర్ధిలుఁగాక యని దీవించుమంత్రము.
205. కారవేల్లము = కాఁకర.
206. ఫుల్లసిలు = కందు.
207. ఈరసము = అసహ్యము; లేఁబడు = లేఁతపడు.
208. వ్యామము = బార.
209. తెమల్చు = తృప్తిపఱచు.
210. ఉప్పరమెత్తి=పైకిలేవనెత్తి.
212. నాడింధముఁడు = అగసాలె; కమ్మరి.
216. కుట్టనము = ఒఱయిక.
221. ప్రగ్రహము = పగ్గము.
222. సెలకట్టె = బాణము.
223. అహితుండికుఁడు = పాముల నాడించువాఁడు.
224. కటుతుంబి=సొరకాయబుఱ్ఱ; మిహి = శ్రేష్ఠమయిన.
226. నల్ల = ఆశ్చర్యార్థకము.
228. ఉరభ్రము = పొట్టేలు.
230. తస్సి = డస్సి; తట్టువాఱు = చిదుకఁబడు.
231. ఆస్కందము = పోరు.

పద్యసంఖ్య.

232. క్రోష్టువు=నక్క; మేంఢము=మేషము; ఏడకము=గొఱ్ఱె; మఘ్న!=ఆశ్చర్యార్థకము.

233. కలుకోడి = ఊరకోడి.

234. జొత్తు = ఎఱువు.

235. తొగడు=గంటు; కృకాటము=పెడతల.

236. యభనము = దుర్గతి.

240. రోవట్టిడి = ధనమిచ్చి.

244. జీవరి = చంద్రశాల.

245. ఆహివెట్టు = తాకట్టుపెట్టు.

248. నీవి = పోకముడి.

249. గొడ్డేఱు = వృథా.

256. త్రవ్వితండమై = వృద్ధియై; విడిముడి = ధనము; లాఁతు = ఎక్కువ.

257. ఘటశాసి = శాస్త్రి; కుహళీచషకములు = పొత్తులసెడుగిన్నెలు.

259. నట్టువుఁడు=వేశ్యలకు నాట్యము నేర్పువాఁడు.

262. స్వైరికుఁడు = వాగటితో భూమి దున్నువాఁడు. కర్షకుఁడు; ముర్మురములు = కుమ్ములు; ఒఱగోయక = లక్ష్యపెట్టక.

263. ఒడ్లు= ఇతరులు; ఉక్కివమాఁడు = కేలిసేయు.

265. పిళ్ల=ఆఱవ; జఱభి = వేశ్యమాత.

267. తుండీరము = దక్షిణదేశము.

271. సోణము = నాసాపుటాలము.

273. తాద్గీయాంకము=మూఁడవది.

275. కంగటికాలు= మంచపుకోడు.

278. చీకువాలు = చీకటి; వింజమాకెడినమాడ్కి=వింధ్యపర్వత మడఁగించినట్లు.

286. అంగారము = నిప్పు.

289. దొరసెము = నిరుటికి ముందటేఁడు.

291. సౌనాన్నటంకములు = బంగరునాణెములు; వెడ్డువెట్టి = తార్చికూర్చి.

293. బడిసిప్పైచు = పొరలియిచ్చు; మూరిఁబోవు = పెచ్చుపెరుఁగు.

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1960.